"త్రొమ్మిదిన్నర కూడా అయింది. ఇంకా వేళ కాలేదా అమ్మా?" అని లక్ష్మి అడిగింది.

"నేనేం నీ మాదిరిగా బోర్లాపడుకుని కాళ్ళాడిస్తూ నవలలు చదువుతున్నాననుకున్నావా." అన్నది హనుమాయమ్మగారు వంట ఇంట్లోకి పోబోతున్నదల్లా ఆగి తన కూతుర్ని కోపంగా చూస్తూ.

లక్ష్మి పాముకాటు తిన్నదానల్లే, "నేను నవలలు చదవడంలేదు. యిది క్లాసుపుస్తకమే, కావలిస్తే చూడు. 'ది డిక్లయిన్ ఎండ్ ఫాల్ ఆఫ్ ది రోమనెంపైర్!' అన్నది బుస బుసా.

"క్లాసు పుస్తకాలు చదివే బోడివి నవలలు చదువుతున్నట్టు బోర్లాపడుకొని కాళ్ళాడించడమేం ! ఆ చీరె సరి చేసుకో ముందు. హవ్వ! అన్నీ బజారుచేష్టలే! ఆడముండ ప్రకావులే! ఇటువంటివికూడా చెప్పించుకోవాలిటే. బిగ్గ్యా చదువుతున్నావు. నీ చదువెందుకూ? అడుక్కు తిన్నా!"

లక్ష్మి పుస్తకం టపీమని మూసి, "నాకు పది నిమిషాల్లో అన్నం పెట్టాలి, లేకపోతే కాలేజీకి లేటవుతుంది," అన్నది.

"నీకు అరగంటదాకా అన్నం పెట్టేదిలేదు. కాలేజీకి పోతావో, మానేస్తావో నాకు తెలీదు. అసలే పనిముండ ఎగ్గొట్టి నాకు చిర చిరగా ఉంది. నన్ను నిష్కారణంగా

12

# కొత్తకోడలు

...ట్టకు. పనికి సహాయం చెయ్యకపోగా ఆడా చేస్తా వంటేమిటి? వెధవముండ ఆడా? ఇదేమన్నా హోటలను కున్నావా? నేనూ మనిషినే. నాకు దేవుడు పదికాళ్ళూ పది చేతులూ పెట్టలేదు... అవును, ఇవాళ ఆలస్యమే అవు తుంది. ఏం ఒక రోజాలస్యమైతే? తలగొట్టి మొలేస్తారా? చివాట్లు పెడతారూ? పడూ? ఏం ఫరవాలేదు. నువ్వేంవీ సీమ రాణీవి కావులే!''

హనుమాయమ్మగారు కూతురి మీద అంతకంతకూ కోపం పెంచుకుని లక్ష్మి అనని మాటలుకూడా ఊహించు కుని అగ్గిరాముడై పోయింది.

నిజానికి ఇదంతా అనవసర హైరాన. లక్ష్మి పదినిమి షాల్లో అన్నం పెట్టమనేసరికి వంటఅయిపోయింది. హనుమా యమ్మకు మండిందల్లా లక్ష్మి అట్లా తనతో మాట్లా డడమా అనే!

లక్ష్మి, చలపతీ, ఆఖరువాడు నెహ్రూ అన్నాలు తింటూండగా ముసలాయన కనకయ్య బయటినుంచి "ఎవరో వచ్చారే!'' అని లోపలికి కేకేశాడు.

"ఎవరో వచ్చారనకపోతే ఎవరో కనుక్కో గూడదూ? చెయ్యి వీలుగాని సమయంలోకూడా ప్రెద్దానికీ నేనే యాడవాలీ!'' అని హనుమాయమ్మ లోపట్నించి కేక పెట్టింది.

ఇంకా ఆవిడ కేకల ప్రతిధ్వనులు అణగారిపో కుండానే ఒక ఆడపిల్ల మొహం వంటింట్లోకి తొంగి చూసింది.

"భోజనాలు చేస్తున్నారా, కానివ్వండి. నేను ఇక్కడ కూచుంటాను కాస్సేపు," అంటూ ఆ మొహం అంతర్ధానమయింది.

చలపతీ, లక్ష్మి ఒకరినొకరు కళ్ళతో ప్రశ్నించుకున్నారు. తరవాత ఇద్దరూ తల్లికేసి చూశారు.

"నీ కోసం గావాలు!" అన్నది హనుమాయమ్మ ఆ మొహానికి తాను పూచీ పడటం ఇష్టం లేనట్టుగా.

"నా క్లాస్‌మేట్ కాదు." అన్నది లక్ష్మి.

"నీ తిండి అయిపోతే లే! నీ కంచం మాత్రం కడిగి అట్లా నడవలో పెట్టు," అన్నది తల్లి.

"వాళ్ళదికూడా కానీ, అన్ని కంచాలూ ఒక్కసారే ఎత్తుకుపోతా," అన్నది లక్ష్మి.

"మా గొప్పపని చేస్తావు!....నా చేత అరిపించకు. అవతల ఎవరో ఉన్నారుకూడానూ. ఇల్లు మైలమంగలం చెయ్యటానికి నీకు ఎక్కడలేని పనిమంతనంవూ వస్తుంది! నీ యీ వేషాలు చూస్తేనేగా నాకు భగ్గునమండేది?.... లేవేం? లే!" అన్నది హనుమాయమ్మ నిగ్రహంతప్పి అరుస్తూ.

ఆ వేడిలోనే ఆవిడ హాల్లోకి వెళ్ళి అక్కడ వేచి వున్న అమ్మాయినిచూసి, "ఏమిటమ్మా? ఎవరికోసం?" అన్నది.

ఆ అమ్మాయికి ఇరవైయేళ్ళుండొచ్చు. గుండ్రని మొహం, చక్కని ముక్కు, ఓమాదిరికళ్ళు, చిన్నచెవులు,

చెవులకు ఒంటి రాతి కమ్మలూ, జుంకీలూనూ, మొహానికి పౌడరూ పాడూ అద్దుకోకపోయినా కళగా ఉన్నది.

"నేను కోదండరామయ్యగారమ్మాయినండి. నా పేరు సరోజిని," అన్నదామె.

రైలు రాబోయేముందు చెక్కలాగా హనుమాయమ్మ దవడ కిందికి ఒరిగిపోయి అట్లాగే ఉండిపోయింది. ఆవిడ వేళ్ళు ఏదో టెలిగ్రాం కొడుతున్నై.

"పెళ్ళి విషయం మా నాన్నతో మాట్లాడారుట. మీ ఇంటి ఎడ్రసు కనుక్కుని బయలు దేరివచ్చా. పద మూడు నంబరు బస్సులు చాలా బ్రేక్ డౌన్ అయాయట. లేకపోతే అరగంట కిందనే రావలసినదాన్ని."

సరోజిని అడిగిందిగాని హనుమాయమ్మగారి తలలో శూన్యం ఇంకా పూడలేదు. అందుచేత ఆమెకు నోట ఏ మాటా రాలేదు.

"ఇంతకూ పెళ్ళి కావలసిందెవరికి?" అన్నది సరోజిని.

ఆమె ప్రశ్నకు సమాధానంలాగా చలపతి చేతులూ, మూతీ తువాలుతో తుడుచుకుంటూ హాలులోకివచ్చాడు. (హాలంటే అది నిజంగా హాలుకాదు. అదీ మిగిలిన గదులంటిదే, మర్యాదకోసం దాన్ని హాలంటున్నారు.)

సరోజిని ప్రశ్న చలపతికి వినిపించింది. "నాకే!" అన్న రెండక్షరాలూ అతని నోటి వెంట రావడానికి

మోరాయించినై. రెండు గంటల క్రితం హనుమాయమ్మ మీద బట్టలు ఎదురు తిరిగినట్టుగానే ఇప్పుడు చలపతికి మాటలు ఎదురు తిరిగినై.

సరోజిని అతనికి సహాయంచేస్తూ, "మీరేనా చలపతిరావుగారు?" అని మంచిగా అడిగింది.

"అవును," అన్నాడు చలపతి, అంతవరకైనా తనకు సామర్థ్యం ఉన్నందుకు ఆశ్చర్యపడుతూ.

"నా పేరు సరోజిని. కోదండరామయ్యగారి అమ్మాయిని. మానాన్నగారు తొందరపడి ఏదో ఒకటి అనే ముందుగా ఒకసారిచూస్తే మంచిదనిపించింది. ఎంత చెడ్డా పెళ్ళిచూడడండీ!" అన్నది సరోజిని.

"అవును," అన్నాడు చలపతి. ఆ మూడక్షరాలు ఎన్నిసార్లు అనవలసివచ్చినా "రీటేక్" ఏడవకుండా అనగల స్థితిలో ఉన్నాడతను.

సరోజిని ఒక్కక్షణం ఆగి, "మిగిలిన వాళ్ళను కూడ పరిచయం చేస్తారా?" అని అడిగింది.

చలపతి మూడోసారి "అవును" అనటానికి సిద్ధపడుతున్నవాడు కాస్తా మానసికంగా ఒక్క అడుగు వెనక్కు వేశాడు. తరవాత అతను తన తల్లిని తనతల్లి అనీ, లక్ష్మిని తన చెల్లెలనీ, బియ్యే సెకండియర్ ప్రారంభించిందనీ, నెహ్రూను తన తమ్ముడనీ, బయట ఉబ్బసంతో బాధపడే ఆయన తన తండ్రి అనీ పరిచయం చేశాడు.

"మీలో ఎవరికన్నా ఉబ్బసం ఉన్నదా?" అని సరోజిని అడిగింది. చలపతి ఆమెకేసి కళ్ళు పెద్దవిగా చేసి చూశాడు.

"అది తల్లిదండ్రులనుంచి పిల్లలకు రావచ్చు," అన్నది సరోజిని డాక్టరులాగా.

"మాకెవరికీ లేదు ఇంతవరకూ," అన్నాడు చలపతి.

హనుమాయమ్మ తలలో ఖాళీజాగా అకస్మాత్తుగా పూడినట్లయింది.

"అయితే చూడమ్మాయ్! నిన్ను మీం వాళ్ళు పంపారా?" అని ఆవిడ సరోజిని నడిగింది.

"లేదండీ, నేనే వచ్చా—నా ఆదుర్దాకొద్దీ. పెళ్ళి విషయమై నాకూ మావాళ్ళకూ అభిప్రాయాలు కలవ్వు. వాళ్ళది పూర్వకాలపు పద్ధతి, నాది ఈ కాలపు పద్ధతి."

చలపతీ, లక్ష్మి, సరోజినికేసి వింతజంతువునుచూసి నట్టు చూశారు. హనుమాయమ్మగారి ఆలోచనలు మళ్ళీ ఇగిరిపోయినట్లయింది.

సరోజిని అటూ యిటూచూసి, "మీరంతా నిలబడే ఉన్నారు. కూచోండి," అన్నది.

ఎవరూ మాట్లాడలేదు. కదల్లేదు.

"ఇదిగో! ఒకసారి వస్తారా? ఆ కోదండరామయ్య గారమ్మాయి వచ్చింది." అని హనుమాయమ్మ తన భర్తను కేకేసింది.

"వారిని చూచాను. మేం కొంతసేపు మాట్లాడు

కున్నాం." అన్నది సరోజిని. ఆమె నిష్పక్షపాతంగా చలపతినీ, లక్ష్మినీ, హనుమాయమ్మగారినీ పరిశీలించి చూసింది. నెహ్రూ అక్కడ నిలవక లోపలికివెళ్ళి కాస్సే పటికి పుస్తకాలతో బయటికి వచ్చాడు.

నెహ్రూ చేతిలో పుస్తకాలు చూడగానే లక్ష్మి ఉలిక్కి పడింది ఆమె కాలేజీకి వెళ్ళటం విషయం పూర్తిగా మరచిపోయింది. చలపతికైనా తొందరలేదు. ఖాళీలో పని చేస్తున్నాడు, పదకొండింటికి చేరినా ఆఫీసులో అడిగేవాళ్లు లేరు.

"నా మూలంగా మీరు పనులు చెడగొట్టుకోకండి," అంటూ సరోజిని వాళ్ళకు "డిస్మిస్" చెప్పింది. ఆమె ఉత్తరువు కోసం ఎదురు చూస్తున్నవాళ్ళల్లే ముగ్గురూ కదిలారు.

"నెహ్రూ, నేనుకూడా వస్తున్నానుండు, పోబాక!" అంటూ లక్ష్మి లోపలికి పరిగెత్తింది.

చలపతి డ్రెస్ వేసుకుని బయటికివస్తూ సరోజిని తన తండ్రితో ఎదురు మాట్లాడుతూ వరండాలో ఉండటం గమనించాడు. తనను చూడగానే ఆమె ముసలాయనతో వెళ్ళొస్తానని చెప్పి బయలుదేరింది. ఇద్దరూ కలిసే బయటికి వెళ్ళారు.

వాళ్ళిద్దరి తలకాయలూ జంటగా కదులుతూండటం వంటఇంటి కిటికీలోంచి ప్రహరీగోడమీదిగా చూసి హనుమాయమ్మగారు "హవ్వ!"అని నోరు నొక్కుకున్నది.

# 3

సాయంకాలం అయిదున్నర ప్రాంతాల బావిబొడ్డు దగ్గిర చిన్న సమావేశం జరిగింది. హనుమాయమ్మగారూ జానకీ, లక్ష్మి, పొరుగిళ్ళవాళ్ళు అలిమేలూ, కనకమ్మా, వాళ్ళమ్మాయి పన్నెండేళ్ళది, కమల చేరారు.

"హవ్వ!" అన్నది హనుమాయమ్మ మనకు కంటి న్యూయిటీ కలిసి వచ్చేట్టు.

"ఏమోనమ్మా! పెళ్ళికూతురు పెళ్ళికొడుకును చూడరావడం నే నెక్కడా చూళ్ళేదు, విన్లేదు." అన్నది కనకమ్మగారు. కమల తల భుజాలమధ్య ఇరికించుకుని "హి హిహి" అన్నది.

"ఊరికే పెళ్ళి చూపులకు రావటమేననుకున్నావు టమ్మా, కనకమ్మతల్లీ? సరేలే! మామీద చాలా పెత్తనం చేసింది. నుంచునుంటే కూచో'మన్నది. తరవాత, 'మీరంతా వెళ్ళి మీ మీ పనులు చూసుకోండి' అంటున్నది!"

"ఈ కాలపు చదువులూ, ఈసినిమాలూ ఆడపిల్లల్ని ఇలా తయారు చేస్తున్నయ్యన్నమాట. పైగా పట్నం వాళ్ళు!" అన్నది అలిమేలు.

కమల కిందటిసారిలాగే తలముడుచుకుని, వేళ్ళు ముడిచి నోటికి అడ్డంపెట్టుకుని, "హి, హి, హి, !" అన్నది.

"చేసే అధికారాలన్నీ చేసేసి, పరీక్ష పూర్తి కాలేదు గావాఁలు, మా చలపతి వెంట బయలుదేరింది. మేమెవ్వఁరవ్వూ వినకుండా వాడితో ఏదో మాట్లాడాలి గావాఁలూ!".

"మీరు బాగానే కనిపెట్టారు పిన్నిగారూ, అందుకే ఆఫీసువేళకు బయల్దేరి చక్కా వచ్చింది," అన్నది అలిమేలు. కమల "హి, హి, హి!" అన్నది.

"అన్నయ్యని బుట్టలో వేస్తుంది," అన్నది లక్ష్మి. తన సోదరుడు స్త్రీల మాయలకు అతీతుడుగా ఉండగలడని ఏ సోదరికూడా నమ్మదు.

హనుమాయమ్మకు పౌరుషం వచ్చింది. "బుట్టలో వేస్తుందిగా ? నా బొందిలో వూపిరుండగానే ?" అని ఆపిని లక్ష్మిని సవాలు చేసింది.

"పిల్ల అందంగా ఉందా పిన్నిగారూ ?" అని జానకి అడిగింది.

"అందం కొరుక్కుతింటాఁవా జానికమ్మా?" అన్నది హనుమాయమ్మ.

"అలా అనకండి పిన్నిగారూ! మగవాళ్ళు ఒక్క అందానికే లొంగుతారు. ఆ మూడో ఇంట్లో ఆవిడ అందం తోనేగా మొగుణ్ణి కాళ్ళూ చేతులూ కట్టిపడేసిందీ ?"

"మా చలపతి అట్లాంటివాడు కాడులే! అయినా ఆ మ్మాయి అంత పెద్ద రంభేఁవీ కాదు," అన్నది హనుమాయమ్మ గ్యారంటీగా.

"అమ్మ చెప్పటానికేం? ఆమనిషి చాలా అందంగా వుంటుంది. మామూలు చీరే కట్టుకుని, నగలూ అవీ ఏవీ పెట్టుకోకుండానే, టాయిలెట్టూ అదీ చేసుకోకుండానే చక్కగా వుంది! అన్నీ, చేసుకుంటే ఇంకా బాగుంటుంది," అన్నది లక్ష్మి.

"అమ్మ ఎప్పుడూ అట్లాగే అంటుంది. పొద్దునొచ్చి నమ్మాయి చాలా బాగుంది. అందరికన్నా బాగుంది." అందరూ తలలుతిప్పి ప్రహరీగోడ ఎక్కికూచున్న నెహ్రూను చూశారు.

"ఆడంగి రేఖల అచ్చెమ్మల్లే - పో అవతలికిపోయి చదువుకో, ఆడుకో," అని హనుమాయమ్మగారు కొడుకును కేక వేసింది. నెహ్రూ కదల్లేదు. కాని తనకు ఆడవాళ్ళతో జోక్యం లేనట్టు వీధికేసి శ్రద్ధగా చూడసాగాడు.

"ఇంకేం? ఈ ఇద్దరికీ నచ్చిన మనిషివాడికి మాత్రం ఎందుకు నచ్చదూ?" అన్నది హనుమాయమ్మ సభాసదులతో.

"మీ రంతా ఆ అమ్మాయిని చూడబోయేటప్పుడు నన్నుకూడా పిలవండి పిన్నిగారూ!" అన్నది జానకి.

"సర్లేలే! పెళ్ళిచూపులు అయిపోయెగా! ఇక పురోహితుణ్ణి మాట్లాట్టమే తరవాయ!" అన్నది హనుమాయమ్మగారు.

"నాకూడా ఒంటిరాతికమ్మలు చేయిస్తావాఅమ్మా!" అన్నది వేళాపాళా, సమయమూ, సందర్భమూ ఎరగని లక్ష్మి.

హనుమాయమ్మగారి మనసు గుమ్మడిపాదుపాకినట్లు ఒక్కసారిగానాలుగు వేపులా పాకింది. ఒకవంక "నాకూడా" అన్నమాటకు "పొద్దునవచ్చిన అమ్మాయిలాగా" అని ఆవిడ అర్థం చేసుకున్నది. రెండోవంక పదేనిమిదేళ్ళు ముడ్డి కిందికొచ్చి బియ్యే చదివే తన కూతురుకు ఎప్పుడేది మాట్లాడాలో తెలీదేమా అని ఆశ్చర్యపడింది.

ఇటువంటి సందర్భాలలో తల్లీ కూతుళ్ళమధ్య అప్రస్తుతులు చాలా విచిత్రంగా పలికేవి.

లక్ష్మి ఉద్దేశ్యం తాను తల్లికి మాత్రమే అర్థమయే టట్టు మాట్లాడానని, జ్ఞాపకం రాగానే విషయం ప్రస్తావించకపోతే మళ్ళీ ఎప్పటికిజ్ఞాపకంవస్తుందో అని-జ్ఞాపకంరాకుండానే పోతుందేమో అని కూడా. నలుగురిమధ్యా అడిగితే తల్లి తనతో ఘర్షణ పెట్టుకోవడం ఇష్టంలేక సరేలెమ్మంటే తన అవసరం తీరిపోతుందని—ఆ మాటకు తల్లిని కట్టేసి తన పని తీరినదాకా హింసపెట్టవచ్చునని!

ఇక హనుమాయమ్మగారి మనసు దీనికి సంబంధం లేకుండా పనిచేసింది. తాను చిరాకుపడితే కూతురు నోరు మూస్తుందనే దురాశ ఆవిడ కూతురి మాటలు తనకు అర్థం కానట్టు నటించేది. అప్పుడు లక్ష్మి అందరికీ అర్థమయే భాషలో చెప్పవలసి వచ్చేది. ఆ తరువాత హనుమాయమ్మ గారు వాళ్ళుండి కూతుర్ని ఛడామడా కేకలేసేది. తర వాత ఇంట్లో తల వాచేట్టు పెట్టేది. అందరికీ తెలిసేట్టు

నువే చేశావు!" అనేది లక్ష్మి. హనుమాయమ్మకు ఆ మాటతో పూనకం వచ్చేది.

ఈ విధంగా లక్ష్మితో ఒకటి రెండు సార్లు జరిగినప్పటికే హనుమాయమ్మ, "నాకూడా అంటే? ఇప్పుడెవరు పెట్టుకున్నారసే?" అన్నది చిరాకుగా.

"నీ కన్నీ తెలుసులే," అన్నది లక్ష్మి.

"తెలిస్తే ఎందుకడుగుతానూ? ఆ చెప్పేదేదో తెలిసేట్టు చెప్పి ఏడవరాదూ?"

"పొద్దునమ్మాయి పెట్టుకొచ్చిన కమ్మలూ, జుంకీలూ భలే బాగున్నై. ఈ కమ్మలు పెట్టుకుంటే అమ్మమ్మలాగున్నావంటున్నారు. ఈడుకు తగ్గట్టుగా లేనే లేవుట," అన్నది లక్ష్మి.

హనుమాయమ్మ వెటకారానికి దిగింది.

"ఇవాళ పొద్దునదాకా ఏవంకా లేని కమ్మలకు ఈ కాస్సేపట్లో జనులు ఎన్నివంకలు పెట్టారే నాతల్లీ" అన్నదావిడ.

"ఎప్పుడూ వంక పెడుతూనే ఉన్నారు, ఎందుకని నేనే నీతో అనటంలేదు," అని లక్ష్మి గొణుక్కున్నది.

ఏమైనా పెళ్ళికూతురు పురాణం పెడదారి పట్టింది. పనులు కాచుకూచున్నాయని ఒకొక్కరే జారుకున్నారు. నెహూరి గోడమీద లేదు. లక్ష్మి మూతి ముడుచుకొని కొంచెంసేపు కూచుని, అలిగినట్టు తెలియడానికి విసురుగా ఇంట్లోకి వెళ్ళిపోయింది.

"మీ పనిమనిషి మూడుగంటలకు వచ్చిందల్లే వుందే?" అని జానకి అడిగింది.

"దానికి కడుపులో నొప్పిట," అన్నది హనుమాయమ్మ. జన్మలో ఎన్నడూ కడుపులో నొప్పి అన్నమాటే విననంత ఆశ్చర్యంతో. "సిన్న కాస్త అన్నం జాస్తీగా పడింది. అది తిని కడుపులో నొప్పి తెచ్చుకునుంటుంది. ఎందుకూ? వాళ్ళు డొక్క మాడుతుంటేగాని ఆరోగ్యంగా ఉండరు. వాళ్ళు తిండికి మాడతారే అని మనం జాలిపడతాంగాని, వాళ్ళ శరీరతత్వాలు వేరు."

జానకి, హనుమాయమ్మ గారిపొరుగున రెండేళ్ళుగా ఉంటున్నది. ఆమెకు హనుమాయమ్మగారి సాంఘిక విశ్వాసాలన్నీ తెలుసు. ముఖ్యంగా పనివాళ్ళకు ఏమాత్రం అలుసివ్వటమూ ఆవిడ ఒప్పదు. అలుసిచ్చామో వాళ్ళు నెత్తినెక్కి కూచుంటారు, పనివాళ్ళు అణగి పడిఉండే పక్షంలో తాను వాళ్ళపట్ల సమభావం ప్రకటించటానికి ఆవిడకు అభ్యంతరం లేదు. కాని అట్లా జరగనే జరగదు. మనం వాళ్ళను మనతో సమంగా చూడటానికి ప్రయత్నించగానే వాళ్ళు నిజంగానే మనతో సమంగా ప్రవర్తిస్తారు. అప్పుడు హనుమాయమ్మగారికి అరికాలిమంట నెత్తికెక్కుతుంది.

ఒకసారి జానకి చూటవరసకు, "ఏదో పాపం మనం వాళ్ళచేత నెలపొడుగునా చాకిరీ చేయించుకొని అయిదు రూపాయలిస్తాం. ఒకమనిషి రెండుపూటలా తిండితింటే ఈ అయిదురూపాయలెంతకాలం సరిపోతుందో చెప్పండి

పిన్నిగారూ! అసలే ధరలు మండిపోతుండే. మా ఇంట్లో మేమిద్దరమే అయినా అచ్చంగా తిండికి అయ్యే డబ్బైదాకా అవుతుంది. మేం మళ్ళా బంగారం తినటంలేదు," అన్నది.

హనుమాయమ్మ జానకికి ఒక గొప్ప జీవితసత్యం చెప్పింది :

"చూడు జానికెమ్మా! అచ్చగా మనమిచ్చేదాని మీదే వాళ్ళు బతుకుతున్నారనుకోకు వాళ్ళకు లక్షరకాల బతుకు తెరువులు. మగవాళ్ళు కొంగ్రత్తాలు చేస్తారు. జేబులు కత్తిరిస్తారు, కొందరు సారా కాచి అమ్ముతారుట. పనిముండలు మాత్రం సామాన్యులా ఏం? ఆ శంకరయ్యగారింటో పనిచేసేది సినిమా వేషంవల్లే తయారైనచ్చేది. దాని పై సంపాదన ఎంతో ఎవరికి తెలుసు వాళ్ళ కివన్నీ ఏర్పాట్లుండబట్టే నాలుకూ, అయిదుకూ వచ్చి చాకిరిచేసి పోతున్నారనుకో!"

శ్రామికులలో దొంగతనాలూ, దొమ్మరివేషాలూ లేకపోతే తాను పనివాళ్ళకు రెట్టింపుజీతం ఇవ్వాలిసి వస్తుందని గ్రహించిన హనుమాయమ్మ ఈ వున్న పరిస్థితిని మనస్ఫూర్తిగా ఆమోదించింది. ఆవిడ జానకికి ఇంకో జీవిత సత్యం కూడా చెప్పింది :

"తిండికికూడా చాలదని తెలిసికూడా వాళ్ళు కొద్ది జీతాలకు ఎందుకు పనిచేస్తున్నారంటావు? ఒకటి రాసంటే ఇంకోత్తె వస్తుంది. ఆకలితో మాడేకన్న ఒకపూటతిని బతకటమైనా మేలేగా? ఏమంటావ్? పనివాళ్ళ ఒత్తిడి లేని

చోట మనబోటివాళ్ళు గడ్డి తింటున్నారనుకో. రెండుసార్లు కాఫీ, రోజూ ఇంత అన్నమూ, పండగ పండక్కి చీరే యిస్తేగాని ఆవరణలోకి అడుగుపెట్టరు. ప్రతిపూటా ఒక పచ్చడి పెట్టమనో, కూర పెట్టమనో, అర్థణాడబ్బు లివ్వమనో అడుగుతారు. ఇవ్వకపోయావో పని కలాయిస్తారు. నాగా కట్టుకున్నాం—పని మానేస్తారు. కొన్ని ప్రాంతాల గడ్డి తింటున్నారనుకో—ఇంకా మనం నయంకాదూ? మా నాన్న అంటుండేవాడు—బంగారం పండుతే మట్టుకేంరా! రైతు వొత్తిడిలేని భూమి నాకు ఊరికే యిచ్చినా తీసుకోను' అని. అట్లాగే పనివాళ్ళ వొత్తిడిలేనిచోట ఉండేకన్న పాతకం ఇంకొకటి లేదనుకో!"

హనుమాయమ్మది కుసంస్కారం అని మనం అనుకో వచ్చు. కాని ఆవిడ భావాలలో వర్గస్వార్థమేతప్ప జాతి స్వార్థంకూడా లేదు. ఆడవాళ్లు తోకఝాడించటం ఆవిడ కెంతమాత్రమూ నచ్చదు. "ఆడవాళ్ళకీ చదువు లెందుకు? బియ్యేలు ప్యాసై యేంలాభం, బియ్యంకడిగి పొయ్యిమీద అత్తెసరు పెట్టటం చాతకాకపోయాక? ఆడది అణగిపడి ఉండిన రోజులే మంచివి. ఆ రోజుల్లో ఆడది వెకావెకా నవ్వటం ఉండేదా! మక్కెలు విరగతన్నేవాళ్ళు. రోజు లింత ఘోరకలి కావటానికి కారణం ఆడవాళ్ళే. ఈ కాలపు పెళ్ళిళ్ళేంవిటి? పిల్లతల్లులల్లే పెళ్ళికూతుళ్ళేమిటి?"

"ఆడవాళ్ళిట్లా అయినారంటే సగంతప్పు మగవా ళ్ళది. రానురాను మగవాళ్ళు వట్టి నాపలయిపోతున్నారు.

తనను చూసి పెళ్ళాం ఉచ్చపోసుకునేట్లు చెయ్యలేని మగ వాడు మగవాడే కాడు!"

నిజానికి హనుమాయమ్మగారు మొగుణ్ణి చూసి ఎన్నడూ "ఉచ్చ పోసుకోలేదు." అయితే ఆవిడ తాను తన సత్క్రమ ప్రవర్తన ద్వారా భర్తచేత మాటపడకుండా జరుపుకొచ్చానని అనుకొన్నది. ఈ కాలం మగవాళ్ళు స్వేచ్ఛ ఇవ్వగూడని ఆడవాళ్ళకూడా స్వేచ్ఛ యిచ్చి జీవితాన్ని భ్రష్టుచేస్తున్నారని ఆవిడ ఆందోళన.

చలపతి అయినా ఇటువంటి గోతిలో పడకుండా తప్పించుకుంటాడేమో అని ఆవిడ ఆశపడుతూవచ్చింది. కాని ప్రొద్దున సరోజినిని చూచినప్పటినుంచీ ఆవిడకు తన పెద్దకోడలు లక్ష రెట్లు మెరుగనిపించింది.

"ఈ సంబంధం జరగడానికి వీల్లేదు. జరగనివ్వను. చూస్తూండు" అని హనుమాయమ్మగారు జానకితో శపథం చేసి మరీ ఇంట్లోకి అడుగుపెట్టింది.

# 4

ఇల్లు కుక్కలకు వదిలేసి అందరూ తలా ఒకదారీ వెళ్ళారు. లోపల గాఢాంధకారం "ఈ ముసలాయనకూడా పెత్తనాలకు వెళ్ళవట్టుందే?" అనుకుంటూ ముందరి వరండాలో దీపంవేసి హనుమాయమ్మగారు వంటింట్లోకి వెళ్ళి, అక్కడి దీపంవేసి వంటపని ప్రారంభించింది. ఆవిడకు అంత రమీదా మండిపోతున్నది. ఎవరు ఎక్కడికి వెళ్ళారో, ఏం పనిమీద వెళ్ళారో ఆవిడకు తెలియనప్పుడల్లా జీవితం ఆవిడ గుప్పిట్లోంచి జారిపోతున్నట్లనిపించి, చిరాకు వేసేది. తన మొగుడు ఎక్కడికన్నా వెళ్ళదలిస్తే తనతో చెప్పి పోటా డమా? లక్ష్మి ఎటు వెళ్ళింది? ఎందుకు వెళ్ళింది?

ఎవరిదారిన వాళ్ళు వెళ్ళటంవల్ల ఆవిడకు పెద్ద నష్టం కలగకపోయినా ఇంట్లో ఉన్న నలుగురూ ఎవరి ఇష్టానుసారం వారు తిరగటం మంచి లక్షణం కాదని, ఇట్లా చేసినవాళ్ళు ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక తప్పటడుగు వేసి జీవితం అభాసుచేసుకుంటారనీ ఆవిడ నమ్మకం. ఇది మూఢ నమ్మకం అనుకోవటం పొరపాటు. దీన్ని ఆవిడ స్వానుభవంలో పూర్తిగా రుజువు చేసింది. ఇందుకు పెద్దవాడు లోకేశ్వరరావే ప్రత్యక్ష నిదర్శనం.

మొదటిసంతానం కావడంతో "కోటిగాణ్ని" ఆదర్శప్రాయంగా పెంచటానికి హనుమాయమ్మగారు తన సర్వశక్తులూ ధారపోసింది. పన్నెండో ఏడు నిండేదాకా వాడు "చీమ తలకాయంత" స్వేచ్ఛ కోరకుండా తల్లిగీసిన గిరిలోనే ఉంటూ వచ్చాడు. తన అనుభవాలు ఏ పూటవి ఆ పూట, మళ్ళీ మాట్లాడితే ఏ గంటవి ఆ గంట తల్లికి చెప్పేవాడు. వాడి మనస్సు ఏ పరిస్థితిలో ఎల్లా పనిచేస్తుందో, వాడు ఏంవేంవి చెయ్యాడో ఆవిడకు స్పష్టంగా తెలిపి ఉండేవాడు. అటువంటివాడు కాస్తా చల్లగా చెయిజారిపోసాగాడు. రెండు ప్రశ్నలు వేసేసరికల్లా విసుక్కునేవాడు. "అబ్బ; ఏం చంపుతావమ్మా? ఎక్కడికో పోతున్నాను! ఎప్పుడో వస్తాను," అంటూ సాగించాడు.

కొంతకాలం విసుక్కుంటూనే అడిగినవన్నీ చెప్పాడు. అ తరవాత అబద్ధాలాడటం మొదలు పెట్టాడు. "అబద్ధాలు చెబుతున్నావట్రా నాతో?" అంటే కొరకొరా చూశాడు. ఆ తరవాత అడిగినమాటకు జవాబు చెప్పటమే మానేశేవాడు. వాడు బాగుపడడని ఆవిడ అప్పుడే అనుకుంది. అంతా అయిందికూడానూ!

అంటే కోటేశ్వరరావు కష్టాలు పడుతున్నాడని కాదు; పూనాలో అతను నిక్షేపంగా నాలుగువందల యాభై తెచ్చుకుంటున్నాడు. పెద్ద బంగళాలో ఉంటున్నాట్ట. కాని ఏంలాభం? పెళ్ళాం ఎంత చెబితే అంతా! ఆరునెల్లలో

ఉత్తరం ముక్కయినా రాయదు. పెళ్ళాం రాయొద్దం టుందో, ఏం పాడో?

"కోటిగాడి"కోసం తాను పడ్డ శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరవుతుందని అనిపించగానే హనుమాయమ్మ గారికి "విరక్తి" కలిగింది. అంత మాత్రాన ఆవిడ తన మిగిలిన కొడుకులనూ, కూతుళ్లనూ సర్కసు జంతువులల్లే పెంచలేదని మనం అనుకోరాదు; వాళ్ళచేత సర్కసు చేయించటంలో ఆవిడకు ఉత్సాహం పోయింది. విధిలేక-తాను తన ధర్మం నెరవేర్చుతున్నానన్న సంతృప్తికోసం - తరవాత వాళ్ళు తనవల్ల లాభం పొందలేకపోయామే అని ఏడవకుండా ఉండగలందులకు - తన కృషి నిష్ప్రయోజన మని పూర్తిగా, అనుభవం వల్ల తెలిసికూడా—ఆ అయిదు గురినీ అచ్చగా "కోటిగాణ్ణి" పెంచినట్టే పెంచింది.

చిత్రమేమిటంటే వాళ్ళే నయమనిపించారు. అదే ఆదుర్దాపడి పెంచినట్లయితే వాళ్ళుకూడా ఏ పన్నెండో ఏటనో పెద్దవాడల్లేనే ఎదురు తిరిగి ఉండేవారేమో!

ఇందులో ఉన్న మహత్తరమైన సత్యాన్ని హను మాయమ్మగారు-ఒకసారి కాదు. పదిసార్లు కాదు- లక్షసార్లు రుజువుచేసింది. అన్నం వేసి నువుచూస్తూ ఉండు; అదిఎంతకీ ఉడకుపట్టదు. అన్నం పొయిమీద పారేసి దానివిషయం మరిచిపోయి ఇతర పనులు చేసుకో; నీకు మళ్ళీ అన్నంమాట జ్ఞాపకం వొచ్చి చూసేసరికి చక్కగా ఉడికి, దించటానికి సిద్ధంగా ఉంటుంది! అదేవిధంగా దొడ్లో పూలమొక్క పెట్టి

రోజూ చూస్తూండు, పువ్వురాదు; దాని సంగతి మరచి పోయి ఎప్పుడో జ్ఞాపకం వచ్చినప్పుడు వెళ్ళి చూశావంటే చక్కగా పూసి కనిపిస్తుంది! ఇది ఎంత పరమసత్యమంటే ఇహ దానికి తిరుగులేదు. "కోటిగాణ్ణి" కూడా అశ్రద్ధగా పెంచితే వాడూ బాగుపడిపోయేవాడేమో పాపం. అప్పటికి హనుమాయమ్మగారికింత లోకజ్ఞానమూ అదీ లేకపోయింది.

మనుషులమై పుట్టినాక అన్నీ తెలిసి అజ్ఞానంలో పడక తప్పదు. వెళ్ళిన వాళ్ళలో ఏ ఒకరన్నా వస్తున్నారేమోనని ఆవిడ ఒక చెవి తలవాకలి దగ్గర మళ్ళీ మాట్లాడితే గేటు మీద—ఉంచింది. ఏ మాత్రం అలికిడి వినిపించినా బయటికి వచ్చిచూసింది, ఎవరు ముందువస్తే ఏ ప్రశ్నతో "విచారణ" ప్రారంభించాలో ఆలోచించి పెట్టుకున్నది. కాని ప్రతిసారీ ఆవిడకు ఆశాభంగమే అయింది వాళ్ళ రాక కోసం ఆత్రంగా ఎదురు జూస్తున్నదిగదూ! అందుకని వాళ్ళు రాలేదు. బిందెడు నీళ్ళకోసం ఆవిడ దొడ్లోకి వచ్చేసరికి ముసలాయనా, లక్ష్మి, చలపతీ – ముగ్గురూ ముందుగదిలో రణగొణధ్వనిగా మాట్లాడుతున్నారు.

"ఎక్కడికెళ్ళార్రా ఇంతేసేపూ?" అన్నదావిడ. పెద్ద ఘోరం జరిగినట్టుగా.

"ఎక్కడికెళ్ళటం వేమిటి? నేను ఆఫీసునుంచి దుకాణంమీదుగా ఇప్పుడే వస్తున్నా, ఇంకా వీళ్ళుకూడా కాందే?" అన్నాడు చలపతి.

"నువ్వో?" అన్నది హనుమాయమ్మగారు కూతురితో.

"నేనూ, నాన్న వాళ్ళింటి కెళ్ళాం—"

"వాళ్ళింటికంటే? వాళ్ళకు ఊరూ, పేరూ లేవూ?" అని హనుమాయమ్మ చిరాకుపడింది. లక్ష్మి ఏదో దాచటానికి ప్రయత్నిస్తున్నదానల్లే ఆవిడ కళ్ళకి కనపడింది.

"ఆ సరోజినిగారింటికి, వాళ్ళ నాన్న పేరు నాకు ఎన్ని సార్లు విన్నా జ్ఞాపకం వుండదు. నన్నేవోఁ సొంతం చెప్ప నివ్వవు" అన్నది లక్ష్మి.

"సరోజినవరే?" అన్నది హనుమాయమ్మ గొంతెత్తి.

"కోదండరావయ్యా కూతురు. పొద్దున మనింటి కొచ్చినమ్మాయి. నీకు ఒకటీ తెలీదూ. ప్రశ్నలు వెయ్యకుండా ఉండవూ" అన్నాడు ముసలాయన.

"ఆ కోదండరావయ్యింటికెళ్ళారూ! పనివేళా! ఎందుకూ?" అన్నది హనుమాయమ్మ ఇటువంటిపని జరుగుతుందని అవిడ కలలోకూడా అనుకోనిదానిలాగా కనపడింది.

"ఏదోపనిలేకపోతే ఎందుకుపోతారూ!" అని ముసలాయన చిరాకుపడ్డాడు.

"ఆ పనేఁవిటో చెప్పరాదూ? అంత రహస్యఁవేఁ? తాంబూలాలిచ్చుకుని మరీవచ్చారా? ఏ సంబంధం స్థిరవైనా నాకు తెలియకుండానే స్థిరమవుతుందని నాకు ముందే తెలుసులెండి. మిగిలినవాటన్నిటిలోనూ లేని యోగం ఈ

ఒక్కదాన్లో వచ్చిపడుతుందా ఏమిటి? [illegible]ంకపోతే మునిగి పోయిందిమాత్రం ఏంవిటి?” అని హనుమాయమ్మ దండకం చదివింది.

“నువు అడుగుతున్నావో, చెప్పుతున్నావో నాకర్థం కావటంలేదు. నువు చెప్పదలుచుకున్నట్లయితే చెప్పిందంతా నా కర్థమయింది. తాంబూలాలు ఇచ్చుకున్నాంవా లేదా అన్న విషయం నీకు తెలిస్తే నేను చెప్పనవసరంలేదు. తెలియనిపక్షంలో చెబుతావిను—ఇంకా తాంబూలాలిచ్చుకోలేదు. ఇచ్చుకునేటప్పుడు నువు ఒక్కత్తెవే వెళ్ళి తాంబూలాలు పుచ్చుకుందువుగాని,” అన్నాడు భర్త. ఆయన తీరే అంత, గంటసేపు మాట్లాడినా అందులో అర్థం వుండదు. మరీ ముసలితనం జాస్తవుతున్నకొద్దీ ఈ అయోమయపు సంభాషణ మరింత ఎక్కువన్నది. అందుచేత హనుమాయమ్మ తనమొగుణ్ణి క్షమించి, నాపెత్తనంటూ ఈ కొంపలో ఏదన్నా ఉంటే ఈ సంబంధానికి తాంబూలాలివ్వడం పడదులెండి,” అంటూ ఆరితేరిన నటుడిలాగా “డ్రామెటిక్”గా బిందెతో లోపలికి వెళ్ళిపోయింది.

తీరా వంటింట్లో బిందె దింపుకునేటప్పుడుగాని ఆవిడకు పరిహాసం జరిగినట్టు తట్టలేదు. మోసవంటే మోసం వేగా మరి! తనభర్త ఆ కోదండరామయ్యింటికెందు కెళ్ళవలసి వచ్చిందో తనకు తెలియనే లేదు.

“అమ్మాయ్ లక్ష్మీ! ఒక్కసారి లోపలికి రా” అని పిలిచిందామె.

లక్ష్మి వచ్చింది. హనుమాయమ్మ ఆ పిల్లను అట్లా కూచోమన్నది. చాలా మంచిగా "నువుకూడా వెళ్ళావా? నాన్న రమ్మన్నారా? నువే వెంటబడి వెళ్ళావా? అయితే చూడు, వాళ్ళది సొంత యిల్లుటగా? పెద్దదా? ఇంట్లో ఎవరున్నారేం? ఆ అమ్మాయి వుందా?—అదేనే, పొద్దున మనింటికి వాలా? ఆ కోదండరామయ్య కూతురు!" అంటూ ప్రశ్నల పరంపర ప్రయోగించింది.

తల్లి టెక్నిక్ లక్ష్మికి తెలుసు. ఆవిడ వేసిన ప్రశ్న లన్నిటికీ ఓపికగా సమాధానాలు చెప్పింది.

కోదండరామయ్యగారిల్లు అంత పెద్దదీ కాదు. అంత చిన్నదీ కాదు. వాళ్ళు బీదవాళ్ళంటే బీదవాళ్ళు కారు కోదండరామయ్యగారు "నాన్నంత" ముసలి కాదు, సత్యవతమ్మగారు "మీ అంత" రోస్టు మనిషీ కాదు. వాళ్ళకు సరోజిని ఒక్కతే పిల్ల. ఎంతో అవసరమైతే తప్ప ఒకరితో ఒకరు మాట్లాడుకోరు. కోదండరామయ్యగారు ఇంజినీరు కాదూ, రేడియో విప్పదీసి ఏదో చేస్తున్నాడు. వాళ్ళింట్లో అయిదో, ఆరో రేడియోసెట్లులున్నై. అందులో ఒకటి "నా అంత" ఉంది. వాళ్ళింట్లో ఎలక్ట్రిక్ లైట్లూ, షేడ్లూ అన్నీ కోదండరామయ్యగారు సొంతంగా అమర్చినవే. లైట్లు వేస్తే ఇల్లు భలే బాగుంటుంది. రంగురంగుల షేడ్లు. ఒకటీ కొన్నది కాదు. వంటింట్లోనుంచి మూడు బజర్లున్నై. ఒకటి హాలులోకి, ఒకటి గదిలోకి, ఒకటి వరండాలోకి ... బజరంటేనా? ఒకవిధమైన ఎలక్ట్రిక్ బెల్లు ... రైలుగేట్లు

దగ్గర మోగేలాంటిదికాదు. ఇంకోరకం. సత్యవతమ్మగారు మిగిలిన ఇద్దర్నీ తినటానికో తాగటానికో పిలవాలంటే మూడు బటన్లూ నొక్కేస్తుంది-హాయి!.... అవును, వాళ్ళకు సరోజిని ఒక్కతే కూతురు. సరోజిని ఎక్కువ చదువుకో లేదు. ఇంటరు ఒక ఏడు పూర్తిచేసి రెండోయేడు చదువు తుండగా టైఫాయిడ్ వచ్చిందట. వాళ్ళ నాన్నే మందిచ్చాట్ట. రెండు వారాలు దాటగానే జబ్బునయమయిందట. కాని, చదువు మానేసి సంగీతం సాధనం చేసిందట. సంగీతం పాడటంవా? .. చాలా బాగా పాడుతుంది. సితార్ వాయిస్తుంది. వాయించివినిపించింది కూడా. లేబాగావాయిస్తుంది. పుస్తకాలు చదవటం, సంగీతం సాధన చెయ్యటం, గులాబీలు పెంచటం - ఇంత తప్ప ఆ సరోజినికి మరోపనే లేదు. వంటసహాయం చెయ్యటానికి, వెచ్చాలు తేవటానికీ, చెట్లకు నీళ్ళు పొయ్యటానికీ ఒక నాయరు కుర్రాణ్ణి పెట్టుకున్నారు—

"నాయరుచేత వంట చేయించుకుంటారూ? వీళ్ళ ఆచారం అడుక్కుతిన్నట్టే వుంది! ఇంతకూ మీ రెందుకు వెళ్ళినట్లు? వెళ్ళి ఏం చేశారు?" అని హనుమాయమ్మ అడిగింది.

"నాన్నా, ఆ కోదండరావయ్యగారూ కూచుని నాన్న జబ్బు విషయం మాట్లాడుకున్నారు. నేనూ సరోజినీ కబుర్లు చెప్పుకున్నాం. తరవాత సరోజిని పాడింది. కాసేపు సితారువాయించింది. తను చదివే పుస్తకాలు చూపించింది.

గొప్ప గొప్పవాళ్ళు రాసిన నవలలు - వాటిలో ఒక్కటి కూడా నేను చదవలేదు. మనింట్లో ఒక్క పుస్తకం వుండదు. పుస్తకాలమాట అటుంచు, వాళ్ళింటికి రాని పత్రిక లేదు."

"వట్టి దుబారా మనుష్యుల్లాగున్నారు. తరవాత ఏంచేశారూ?"

"ఏముందీ? నాన్నకు ఆయన ఏదో మందిచ్చాడు. సరోజిని నాకు రెండు రంగు గులాబీ లిచ్చింది. చక్కా వచ్చాం. చూడు ఎంత పెద్ద పూలో!" అంటూ లక్ష్మి తలతిప్పి చూపించింది.

హనుమాయమ్మ పూలను గురించి ఆలోచించ నిరాకరించింది. అవతల పూలకంటె వెయ్యిరెట్లు ముఖ్యమైన మందు సంగతి తేలకుండా పూల సంగతి - ఎక్కడబడితే అక్కడ ఉండే పూల సంగతి - ఎవరు విచారిస్తారు?

"అయినా నాన్నకు మందియ్యాట వేంవిటే? ఆయనేం వన్నా వైద్యుడా! ఆయనెట్లా యిచ్చాడు, ఈయనెట్లా తీసుకున్నారు!" అన్నది హనుమాయమ్మ.

"సరేలే, ఆయన హోమియోపతి మందులిస్తాడు. సరోజినికి టైఫాయిడ్ వస్తే ఆయనే నయంచేశాడు. ఆయన ఎన్నో రోగాలు కుదిర్చాట్ట.

"ముందు మనరోగం కుదిర్చేట్టున్నాడు. ఉబ్బసానికి మందే లేదని లోకం కోడైకూస్తుంటే, ఆయన మందియ్యటమూ, ఈయనకు కుదరటమూ - నే చూడను" అన్నది హనుమాయమ్మ.

# 5

తరవాత ఒక గంటన్నరకు అందరూ భోజనాల కూర్చున్నారు. హనుమాయమ్మగారు వడ్డన చేస్తున్నది.

"వాళ్ళింటో నాయరు కుర్రాడు వడ్డిస్తాట్ట!" అన్నది లక్ష్మి, కేవలం తల్లిని రెచ్చకొట్టటానికి.

"కావలిస్తే పాకీదానిచేత వడ్డించుకోమను-మనదేం పోయింది?" అన్నది హనుమాయమ్మ.

"అట్లాగనుకున్నావా! రేపు మనం వాళ్ళింటికిపోతే ఆ నాయరు కుర్రాడే మనకీ వడ్డన చేస్తాడు" అన్నాడు నెహ్రూ.

"నోరు ముయ్యరా కుంకా! అక్కర్లేంది లేదు! మనం వాళ్ళింటికి భోజనానికి పొయ్యే ఖర్మేం?" అన్నది హనుమాయమ్మ, వంగి లేచినందువల్ల రొప్పుతూ.

"వాళ్ళు బల్లమీద అన్నం తింటారు. మనంకూడా బల్ల కొందాం?" అన్నది లక్ష్మి.

"వాళ్ళు గడ్డి తింటారు - మనంకూడా తిందాం! ఇంత పట్నంలో మనం చూసి నేర్చుకునేందుకు వాళ్ళు తప్ప ఇంకెవరున్నారు?" అన్నది హనుమాయమ్మ వెటకారంగా.

నైహూ తలవంచి రహస్యం మాట్లాడుతున్నవాడల్లే లక్ష్మితో, "అమ్మ ఈ సమ్మంధం కొట్టిపారేసినట్టుంది!" అన్నాడు.

"నోరుమూసుకు తినమని ఇప్పుడేగదరా చెప్పాను?" అని హనుమాయమ్మ అరిచింది.

"నోరు మూసుకుని అన్నం తినటం ఎట్లా?" అన్నాడు నైహూ హాస్యగాడల్లే.

లక్ష్మికి నవ్వొచ్చి కొరపోయింది.

"ఛీ! ఛీ! ఏం మనుషులు! ఏ పూటా చడీ చప్పుడూ లేకుండా అన్నాలు తినరుగదా!" అని హనుమాయమ్మ విసుక్కున్నది.

"నాయిష్టం, నేను మాట్లాడుతా. అందరూ మాట్లాడటంలా?" అన్నాడు నైహూ ఆగ్రహావేశంతో.

"మీ నాన్నా, చెలపతన్నయ్యా మాట్లాడకుండా తినడంలా?" అన్నది తల్లి.

"ఈ సంబంధం విషయం నువ్వు చెప్పేది పూర్తి కాగానే నా ఉద్దేశం చెబుదామనే అనుకుంటున్నా" అన్నాడు చలపతి.

"ఇంకా పూర్తయే దేంవిటి? నాకీ సంబంధం పూర్తిగా యిష్టం లేదంటే!" అన్నది హనుమాయమ్మ.

"ఏం?" అన్నాడు ముసలాయన అకస్మాత్తుగా.

తన ఉద్దేశం అంత సూటిగా చెప్పినాక ఆయన సంజాయిషీ అడగటం హనుమాయమ్మకు గొప్ప తప్పుగా తోచింది.

"నాకు నచ్చలేదూ! కారణాలేంవైతేనేం?" అన్నదావిడ.

"నీ కారణాలు మాక్కూడా నచ్చితే మేంకూడా అభిప్రాయం మార్చుకుంటాంగా?" అన్నాడు భర్త.

అర్జునుడు తనమీదికి ఒకేసారి రెండు బాణాలు వేసినప్పుడు భీష్ముడికి ఏంవనిపించిందో, హనుమాయమ్మకు ఈ మాటలు వినగానే అదే అనిపించింది. ముసలాయన తన మీదికి జోడస్త్రాలు ప్రయోగించాడు. ఒకటి-వాళ్ళకు— అంటే ముసలాయనతోబాటు చలపతికూడా నన్నమాట!- ఈ సమ్మంధం నచ్చింది; అప్పుడే వాళ్ళు తనకు శత్రుస్థానంలో వున్నారు. రెండు-తను ఈ సమ్మంధం ఎందుకు వద్దంటున్నదీ చెబితే తాను చెప్పింది తమకు నచ్చిందీ, లేందీ వాళ్ళు నిర్ణయించుకుంటారన్నమాట! తనను అవమానించటానికే ఈ ఎత్తు!

తనకీ సమ్మంధం నచ్చకపోవటానికి గల కారణాలు వాళ్ళకీ తెలుసు. ఆడపిల్ల పెళ్ళిచూపులకు రావటంవేవిటి? వచ్చినదని ఇంటి ఆడదిక్కు తనతో పల్లెత్తు మాట్లాడకుండా ముసలాయనకు ముచ్చట్లు చెప్పి, చలపతిని వెంట పెట్టుకు పోవడమేంవిటి? అదంతా అటుంచి, ఈ దిక్కుమాలిన అనాచారపు కుటుంబంతో వియ్యంవేవిటి?

ఇదంతా వాళ్ళకు చెప్పటం అనవసరం. తన కున్న బుద్ధి వాళ్ళకుంటే వాళ్ళు తనను కారణాలడిగేదాకా ఎందుకొస్తుంది!

"మీ రనగా ఎవరెవ రేంవిటి? ఊరికే తెలుసుకోవాలని అడుగుతున్నా" అన్నది హనుమాయమ్మ.

"నాకు సంబంధం నచ్చింది!" అన్నాడు ముసలాయన.

"నాకూ నచ్చింది" అన్నాడు చలపతి.

"నాకూ—డా!" అన్నది లక్ష్మి.

"నాకూ—డా?" అన్నాడు నెహ్రూ.

అందరూ ఏకమై తనను ఒంటరిదాన్ని చేసేశారు మెట్టుకు!

"మీ కందరికీ నచ్చటానికి కారణ మేంవిటని నే నడిగితే?" అన్న దావిడ కయ్యానికి కత్తులు నూరుతూ.

"నాకీ సమ్మంధంలో చెడు ఏంవీ కనిపించలేదు. కోదండరామయ్య చాలా పెద్దమనిషి. ఆయనకున్నదంతా పిల్లకే చెందుతుంది-" అన్నాడు ముసలాయన.

అంతలోనే అడ్డొచ్చి, "దానికోసమే మీరు కని పెట్టుకూ—చున్నారా? నా కింకా తెలీదే? పెద్దవాడి పెళ్ళికి విద్యాపరాలి లాంఛనాల కోసం. నేను ఆలిగానని నన్ను ఇప్పటికీ దెప్పుతూనె వుంటిరే!" అన్నది హనుమాయమ్మ.

ముసలాయన ఓర్పుగా పెళ్ళాంమాట పూర్తి కానిచ్చి "అందుచేత ఆయన మనవాడికన్న మంచి అల్లుణ్ణే - అంటే ఇంకా పెద్ద హోదాగలవాణ్ణే తీసుకు రాగలడు. ఆయనకు కావలసింది హోదా కాదు; కాస్త కుదురైన కుర్రవాడూ, నెమ్మదైనవాడునూ" అన్నాడు.

"ఎంతసేపూ ఆయన సంగతే చెబుతారే? ఆ పిల్ల మాటో?" అన్నది హనుమాయమ్మ.

"పిల్లకేం వంకొచ్చిందీ?" అన్నాడు చలపతి.

"నీకు నచ్చగానే సరా ఏమిటి? మేమంతాకూడా ఆ పిల్లతో ఈదుకు రావాలిగా?" అన్నది తల్లి, తన వెనక పెద్ద బలగం వున్నట్టు.

"నీతో కాపరం చెయ్యటమే ఆలోచిస్తే ఆ పిల్ల మన సమ్మంధానికి ఒక్కనాటి కొప్పాకోదనుకో!" అన్నాడు ముసలాయన.

"అటువంటి దాన్ని తెచ్చి నాకు కోడలుగా అంట గట్టబోతారూ?" ఇంత అన్యాయం హనుమాయమ్మ ఎప్పుడూ ఎరగదు.

"నీకూ నచ్చాల్సిందే అనుకో-నీకు నచ్చినపిల్ల వాడికి నచ్చకా, వాడికి నచ్చినపిల్ల నీకు నచ్చకపోతే ఇక పెళ్ళి అయేదెట్లా?" అని ఆవిణ్ణి భర్త అడిగాడు.

"ఈ సమ్మంధం కాకపోతే, దీని బాబులాంటివి వస్తయ్యండండి" అన్నది హనుమాయమ్మ.

"ఉండక ఇప్పుడేం చేశాం? మంగళసూత్రాలకు ఆర్డరు చేశామా? తాంబూలాలు పుచ్చుకున్నామా?" అన్నాడా ముసలాయన.

ఆ రాత్రి హనుమాయమ్మ పేరుకు నిద్రపోయిందే గాని ఆవిడ బుర్ర ఇంజను ఆడినట్టు తెల్లవార్లూ పని చేస్తూనే ఉన్నది. తాను ఒంటరిగత్తె అయిపోవటం ఆవిడకు కొంచెంగా కూడా బాగా లేదు. వాళ్ళందరికీ ఈ సమ్మంధం నచ్చటం ఆవిడకు అర్థం కాలేదు కూడా.

"అది, వీళ్ళందరికీ ఏదో మందు పెట్టింది. వాళ్ళకు మతులు లేకుండా పోయినై" అనుకున్న దావిడ.

ఏమైనా ఆవిడ తన వైఖరి మార్చదలచుకోలేదు. జానకీ, అలిమేలూ, కనకమ్మా, సుందరమ్మా, సీతారావమ్మా, శారదా బాయీ, రుక్మిణీబాయీ ఏకమై వచ్చినా తాను ఈ పెళ్ళిని ప్రతిఘటించదలచింది. ఎంత విడిచేసినవాళ్ళయినా తాము ఒక్కసారి, "మీ సమ్మంధం మా కొద్దు" అంటే కోదండరామయ్యా, ఆయన పెళ్లామూ మళ్ళీ ఆ మాట ఎత్తుతారా? అప్పుడే ఏమయింది? ఆవగింజలో అరభాగం కాలేదు. వాళ్ళింకా రాలేదు, తానింకా వాళ్లింటికి పోలేదు. తాంబూలాలిచ్చుకోవాలి. ముహూర్తం పెట్టుకోవాలి. పెళ్ళి ప్రయత్నాలు చెయ్యాలి. పై మాసంలో ఎట్లాగూ పెళ్ళిజరిగేదిలేదు. ఆపైన మూఢమి రానేవస్తుంది. ఏం ఫరవాలేదు. వ్యవహారం తాను ఎట్లా నడిపిస్తే అట్లా నడుస్తుదిం.

మర్నాడు గట్టిగా తెల్లవారిందో లేదో ఆ సరోజిని మళ్ళీ వచ్చింది. అందరికీ ఇస్తూ ఇంత కాఫీ ఆ అమ్మాయి కూడా ఇచ్చింది హనుమాయమ్మగారు.

"మీ ఇంట్లో కాఫీ చాలా బాగా వుంటుందే!" అన్నది సరోజిని.

బిర్ర బిగుసుకుపోయివున్న హనుమాయమ్మగారి హృదయకుసుమం రెక్కలు విప్పుకోవటానికి ప్రయత్నించింది. అది ఆమెకు ఏమాత్రమూ నచ్చలేదు. ఎందుకో ఆవిడకు సరిగా జ్ఞాపకం రాలేదుగాని పిల్లకు తానంటే అయిష్టం ఉన్నట్టు ఆవిడ అర్థం చేసుకున్నది. ముసలాయనో, చలపతో అటువంటి అర్థం వచ్చేమాట ఏదో అన్నారు. తానేమో ఆ పిల్లను మనస్ఫూర్తిగా ద్వేషించటానికే నిశ్చయించుకున్నది. అటువంటప్పుడా పిల్ల తనను ఎంత అసహ్యంగా చూస్తే తనకంత అనుకూలంగా వుంటుంది. మరి తన కాఫీని మెచ్చుకుంటుందేమిటి ప్రారబ్ధం! 'దొంగత్తు? అంతకన్న ఏంపీ లేదు, నేనొక్కత్తెనే దీని మాయలో పడలేదు. అందుకని నా మీద సమ్మోహనాస్త్రం వేస్తున్నది!' ఈ మాట అనుకోగానే సరోజినిమీద ఆవిడ ద్వేషం రెట్టింపయింది.

'ఇటువంటి జిత్తులు నామీద పారవేంవ్!' అని మనసులో అనుకున్న దావిడ.

సరోజిని పసిపట్టి ఉండాలి, జానకి ఏదో పనిమీద వచ్చింది.

"రా, జానికెమ్మా! నీకూడా కాస్త కాఫీ ఇవ్వనా?" అన్నది హనుమాయమ్మ.

"ఎందుకులెండి పిన్నిగారూ, నా కాఫీ అయిపోయింది. కాఫీ తాగినకొద్దీ ఆకలి చస్తుంది. పట్నం రాక మునుపు నాకు అలవాటేలేదు ఈ కాఫీ!" మాట్లాడుతున్నంతసేపూ జానకి సరోజినినే చూస్తూ ఉంది. హనుమాయమ్మ ఆ పిల్లను జానకికి పరిచయం చెయ్యలేదు. లక్ష్మికి పరిచయం చెయ్యాలని తట్టిందిగాని, "మా అన్నయ్యకూ, ఈ పిల్లకూ పెళ్ళికోసం మాటలు జరుగుతున్నై" అనటం అసహ్యంగా ఉంటుందని మానేసింది.

"మీరుకూడా ఈ ఇంట్లోనే ఉంటున్నారాండీ?" అని సరోజినే జానకిని అడిగింది.

"అదుగో, ఆ పక్కభాగంలో ఉంటున్నాం" అన్నది జానకి.

"నేనుకూడా మీ పొరుగున చేరతానేమోలెండి" అన్నది సరోజిని.

హనుమాయమ్మ చేతి నుంచి ఖాళీగ్లాసు జారి క్రింద పడి పెద్ద చప్పుడయింది.

జానకి పైకి అంత కంగారు కనిపించకుండా "ఓహో, వీరబ్బాయికి సంబంధం చూస్తున్నారన్నారు" అని నిగ్గలించి సరోజినికే వదిలేసింది.

"అవునండీ, నిన్న ఉదయమే మొదటిసారి వచ్చా. లక్ష్మీ, నాకూ అప్పుడే స్నేహం కలిసిపోయింది."

"నాకు పాటంటే ఇష్టం. సరోజిని బాగా పాడుతుంది. బాగా సితారు వాయిస్తుంది" అన్నది లక్ష్మి తనను తాను సమర్థించుకోవలసిన అవసరం ఉన్నట్టుగా.

"ఈ రోజుల్లో సినిమాలూ, రేడియోలూ వచ్చాక బాగా పాడటమనేదానికి అర్థం లేకుండా పోయింది. పాత కాలపు రోజుల్లో ఎక్కడి ఆవందపుచెట్టు అక్కడే మహావృక్షంగా ఉండేదేమోగాని ఈనాడు లీలా, భానుమతీ, బాలసరస్వతీ, జిక్కీ, ఎస్. వరలక్ష్మి—వీళ్ళతో సమంగా పాడగలిగితేనే బాగా పాడటం!" అన్నది సరోజిని.

"బాగా చెప్పారు.... ఏదన్నా ఒకపాట పాడండి" అన్నది జానకి.

"పాడి వినిపించకపోనులెండి" అని సరోజిని తప్పించుకున్నది.

కాని లక్ష్మి వదిలిపెట్టలేదు. సరోజిని చెయ్యిపట్టుకుని గదిలోకి లాక్కుపోతూ రమ్మని జానకికి కన్ను కులిపింది. గదిలో కిటికీ దగ్గర కూచుని దినపత్రిక చూసుకుంటున్న చలపతి సరోజినిని చూసి, "ఓ, హలో" అన్నాడు.

"మిమ్మల్ని ఈ పూట మా యింటికి భోజనానికి రమ్మని చెప్పటానికి వచ్చాను" అన్నది సరోజిని అతనితో.

"ఓ యస్.... లక్ష్మి అరెస్టులో పెట్టినట్టుందే!" అన్నాడు చలపతి.

"పాట పాడాలట" అన్నది సరోజిని.

"నేనుకూడా వినవచ్చా?" అని చలపతి అడిగాడు.

"ఇది అచ్చగా ఆడవాళ్ళ షో! మీరు దయచేసి బయటినుంచి వినండి" అన్నది సరోజిని.

"అంతవరకే థాంక్స్" అంటూ చలపతి గది బయటికి వెళ్ళాడు. ఆ తరవాత జానకి గదిలో ప్రవేశించింది.

సరోజిని అట్టే ఆలస్యంచేసి నానబెట్టకుండా, "బాలరాజు" పిక్చరులోది రాగమాలిక పాడింది.

లక్ష్మికి పాటంటే ఇష్టం మాత్రమే. కాని జానక్కి సంగీతంకూడా తెలుసు సరోజిని పాటకు ఆమె చాలా ముచ్చటపడింది.

"మీ పెళ్ళి అయ్యాక జిడ్డు పట్టిస్తానుగదా!—" అన్నది జానకి సరోజినితో.

"ఇంకోపాట పాడు సర్!" అన్నది లక్ష్మి.

"నీ కేంనన్నా మతిపోయిందా ఏంవిటి? ఇప్పుడు పాడింది చాలా పాటల పెట్టు" అన్నది సరోజిని.

"లక్ష్మిని నేను సపోర్టుచేస్తే ఏమన్నా ఫలితం ఉంటుందా?" అని చలపతి వాకిలి దగ్గర నిలబడి అడిగాడు.

"సారీ! మీ కందరికీ సంగీతమంటే నిజంగా అంత ఇష్టమైతే ఈ ఇమిటేషన్ పాటలు వినే ఖర్మేం? హాయిగా రేడియో సెట్టు కొనుక్కోరాదూ?"

"మేం కాస్త పిసినిగొట్టువాళ్ళం. మాకు దారిద్ర్య భయం జాస్తి. అందుచేత వీలయినంత దరిద్రంగా బతుకుతుంటాం" అన్నాడు చలపతి.

"దయ్యాలంటే భయం ఉన్నవాళ్ళకు ఎక్కడ చూసినా దయ్యాలు కనిపించినట్టా?" అన్నది సరోజిని.

అందరూ నవ్వారు. జానకి కూడా నవ్వింది.

హనుమాయమ్మ శరీరం వంటయింట్లో ఉన్నదన్న మాటేగాని ఆవిడ రెండు చెవులూ గదిలోనే ఉన్నై. గదిలో జరిగినదంతా ఆవిడ వివరంగా విన్నది.

విని మండిపడింది. తప్పాడుముండ. దానితో ఈకుంక మేం పిసినిగొట్టులం అని చెప్పుకొనటమా? తానేగా పిసినిగొట్టూ? డబ్బు జాగ్రత్తగా వాడుకొనటం తప్పా? అడుక్కుతినాలిస్తే ఎవరన్నా పెడతారా? రోజూ ఎన్నో వందలమంది అడుక్కుంటూ వస్తున్నారు. తాను ఎవరికన్నా ఎంగిలిచెయ్యి విదిలించిందీ? మనం అడుక్కుతింటే ఇంకొకళ్ళయినా అంతేగా?

అదికాదు—ఆ అప్రాచ్య వెధవ అలుసిస్తే ఈకుంక అలుసు తీసుకోనా? పిలవా పెట్టని పేరంటానికి పరాయిదానిగా వచ్చే ఇంతగా నోరు ఝాడిస్తున్నదే, ఇదే ఇంటి కోడలైతే దీన్ని పట్టపగ్గాలుంటాయా?

వీణ్ణి భోజనానికి పిలుచుకుపోవటానికి వచ్చిందీ? వచ్చి తనతో చెప్పకుండా వాడితో చెబుతుందా? అది ఏమనుకుంటున్నది? తాను ఈ యింటి పనిమనిషనుకుంటున్నదా? ఇటువంటి వాళ్ళను నిలువునా చీల్చి ఎండెయ్యాలా వద్దా? తాను పుట్టిపెరిగిన యాభై ఏళ్ళలో తనతో వైకిభవించినవాళ్ళూ, తనకు ఎదురుతిరిగినవాళ్ళూ ఉన్నారుగాని తనను ఇట్లా గడ్డిపోచకింద కట్టినవాళ్ళు ఒకళ్ళు—ఒక్కళ్ళంటే ఒక్కళ్ళు—లేరే! ఏమి దీని అహంకారం? తాను ఎవతెననుకొంటున్నది! ఏంచూసుకుని దీని పొగరు?

వేలెడు లేదు. అక్కుపక్షి, పంచదారమాత్రల్లా నాలుగు నోట్లో వేసి ముసలాయన్ని, ఒక బోడిముండ పాట పాడి లక్ష్మిన్నీ, ఆ జానికమ్మకూడా అదే పోయ్యేకాల వల్లే ఉంది, కళ్ళు తిప్పి చెలపతిని కరిగించి పారేసి జయించా ననుకుంటున్నది గావాలు. తన సంగతింకా ఎరగదు.... ఎప్పుడో అదికూడా తెలుస్తుందిలే....

హనుమాయమ్మ ఉద్రేకంతో చెంబులూ, తప్పాలాలూ ధమాధమా చప్పుడు చెయ్య సాగింది.

# 6

పొద్దున్నే వచ్చిన వానలాగే హనుమాయమ్మ గారికి పొద్దునే వచ్చినకోపం పోదు. దురదృష్టవశాత్తూ తెల్లవారి లేస్తూనే ఎవరో ఒకరు - లేకపోతే ఏదో ఒకటి ఆవిడకు కోపం తెప్పించటమూ ఆ కోపం తేలుకాటులే ఘడియఘడియకూ ఎక్కిపోవటమూ జరుగుతూంటుంది.

ఇవాళ తొలికోపమే చాలా ఉధృతంగా వచ్చింది. ఆ సరోజిని దుర్ముహూర్తంలో వచ్చి అంతపని చేసింది! ఆ తరవాత చలపతి, తల్లి నయానా, భయానా, తిట్టీ, బతిమాలీ ఎన్నివిధాల చెప్పినా ఇంటో తినక ఆ తెంపి అడుగులకు మడుగులొత్తుతూ వాళ్ళింటికి వెళ్ళాడు. దాంతో హనుమాయమ్మ కోపం నసాళాని కెక్కింది. అది చాలనట్టుగా ముసలాయన; భోజనానికూర్చుంటూ, "మొత్తానికి ఆ కోదండరామయ్య ఘటికవైద్యుడే. రాత్రి కాస్త బాగానే నిద్రపట్టింది" అన్నాడు.

"ఇంకేం! తండ్రీ, కొడుకూ చిరతలు తీసుకొని వాళ్ళింటిచుట్టూ భజనచేస్తూ ప్రదక్షిణాలు చెయ్యండి" అన్నది హనుమాయమ్మ.

"మందు పనిచేస్తే పని చేసినట్టుందనికూడా అనుకోకూడదా ఏమిటి, నీ యేలుబడిలో!" అని ఆయన అడిగాడు.

"నా యేలుబడి యెత్తుభారాలైనట్టు ఉంది. గురి ఉంటే మట్టివుండకూడా మకరధ్వజంవల్లే పని చేస్తుందని

మా నాన్న అంటూ ఉండేవాడు. అట్లాగే ఉంది మీకు మందు పనిచేసే పద్ధతిచూస్తే."

"సరే, ఈసారి మందేసుకున్నప్పుడు అది పనిచేసిందీ లేందీ నిన్నడిగి తెలుసుకుంటాలే" అన్నాడు తన భార్య సంగతి ముప్ఫై ఏళ్ళకు పైగా చూస్తున్న ముసలాయన.

"నేను అన్నదికూడా అన్నానని ఇంత ఉడుక్కుంటున్నారే, అది ఎవతో వచ్చి మీ కొడుకును ముక్కు పట్టుకు లాక్కుపోయింది. ఏమన్నా ఆపగలిగారా?"

"నిన్నాపగలుగుతున్నానా, దాన్ని ఆపటానికి. కనీసం వాడు ఇష్టపడి దానిమాట వింటున్నాడు, నేను ఇష్టంలేకుండా నీ రూల్సులన్నీ పాటిస్తున్నానే!"

"నారూల్సు పాటిస్తున్నారా? ఆ జానికమ్మ మొగుడికి చెప్పండి నమ్మతాడేమో. నాకు చెబితే నే నెట్లా నమ్మతానూ ?"

"నీకు తృప్తి కలిగేటంతగా నీ చెప్పుచేతుల్లోనే వుండటంలేదేమో ఒకవేళ-నా కొక్కావలసినంతగా నీ రూల్సును ఉల్లంఘించటమూ లేదు. నేను నీ ప్రాణానికి కాళ్ళుతుడుచుకునే పీచట్లే ఉంటే సంతృప్తి కలుగుతుందేమో గాని నాకు దేవుడు అంత ఓర్పు పెట్టలేదు."

"ఈ సొదంతా ముఫ్పైయేళ్ళుగా వింటున్న దేగాని అన్నం తినండి."

ఏ విషయమైనా కానివ్వండి. తాను అనదలచుకున్నదంతా అనే లోపునే అవతలివాళ్ళు సంక్షేపించ చూస్తా,

తాను కట్టిపెట్టదలచుకున్నాక ఆ విషయాన్ని గురించి మాట్లాడుతూపోయినా హనుమాయమ్మగారికి చెడ్డ చిరాకు. మాట్లాడేటప్పుడు మోతాదు తూకం - పడి-తనకు తెలిసినట్టు మరెవ్వరికీ తెలియకపోవటం ఆవిడ అనేక దశాబ్దాలుగా గమనిస్తున్నది. ఆ మోతాదు గురించి ఎవరి నిర్ణయం వాళ్ళ కుండవచ్చునన్నది ఆవిడకు ఆటే గణించవలసిన విషయంగా కనపడేదికాదు.

చలపతి ఇంకా చీకటి పడకుండానే ఇంటికి వచ్చాడు. ఖర్మచాలక అతను వచ్చే క్షణానికి హనుమాయమ్మగారు వీధి వాకిలిదగ్గరే ఉన్నది. ఏదో కారు వచ్చి ఆగటం మాత్రమే మొదట ఆవిడ గమనించింది. ఆ కారుకు "గూడు" ఉండటం చూసి టాక్సీ అని ఆవిడ తెలుసుకున్నది. అందులోనుంచి చలపతి దిగటంచూచి దిగ్భ్రాంతురాలయింది. దిగిన చలపతి వెంటనే టాక్సీవాడికి డబ్బులిచ్చి లోపలికివచ్చెయ్యకమళ్ళీటాక్సీలోకేతొంగిచూసేసరికి "అదికూడా మళ్ళీవచ్చిందా ఏవిటి? కొంపకి పీడపట్టిందే, పీడ! ఏ పీడ వదిలినా ఈ పీడ వదిలేటట్టులేదు. ఇంకేం? అదీ వీడూ కలిసి రోజల్లా టాక్సీలో విహారాలు చేస్తున్నారు గావాలూ! కొంప గుండవే, అడుక్కుతింటారు చూస్తూఉండు" అని పెద్ద స్వగతం ప్రారంభించింది.

హనుమాయమ్మగారు ఆలోచనా పరంపరలో పడినప్పుడల్లా ఒక చిత్రమైన మనస్తత్వం ప్రదర్శించేది. ఈ క్షణం ఊహలుగా తలలో మొలచినవి మరుక్షణానికి రుజు

పైన సత్యాలుగా భాసించేవి; ఆ తరవాత ఆవిడ ఆ ఆధారంమీదగోదావరి వంతెనలూ, శోణానది వంతెనలూ సునాయాసంగా నిర్మించేసేది. మొట్టమొదటి ఊహ నిజం కాకపోయేసరికి ఈ వంతెనలన్నీ కుప్పన కూలిపోయేవి. ఈ విధంగా రోజుకు పదిహేనుసార్లు జరిగినా ఆవిడ నిరుత్సాహపడి ఈ అలవాటు మానుకునేదిగాదు. అట్లా, ఊహలను పరమసత్యాలనుకుని, వాటిపైన వంతెనలూ, కట్టడాలూ, గగనహర్మ్యాలూ నిర్మించటంలో ఆవిడకేదో ఆనందం వుంది. ఆనందమిచ్చే ప్రతి దురలవాటూ వ్యసనమే. ఇది ఆవిడకున్న వ్యసనాలలో ఒకటి.

ఇంతకూ చలపతి వెంటవచ్చిన "అది" ఒక పెద్ద అట్టపెట్టె... అట్లాచెప్పు,! దానికోసం టాక్సీకి తగలేశాడన్నమాట! "దాని" కోసం ఏదో కొన్నట్టున్నాడు! ఇప్పుడే "అది" వీడిచేత డబ్బు మంచినీళ్ళల్లే ఖర్చు పెట్టిస్తున్నదే, ఆ తరువాత—అంటే వీడికి ఉద్యోగం దొరికి, "దాన్ని" వీడు పెళ్ళాడినాక-ఇంకెట్లా వుంటుందో అని! తన బొందెలో ఊపిరుండగానే ఇన్ని ఘోరాలూ జరిగిపోవలిసిందే?

"ఏంవిట్రా ఆ పెట్టె?" అన్నదావిడ. "శానా బరువల్లే ఉందే?"

టాక్సీవాడు "గూడు" టింగ్ మనిపించి డబ్బులు తీసుకుని, మళ్ళీ ఇంకోసారి టింగ్ మనిపించి, తలుపులు ధన్ ధన్ అని మూసి, తుర్రుమని వెళ్ళిపోయినాడు.

"లోపలికిరా, చూద్దాగాని," అంటూ చలపతి అట్టపెట్టెను రెండుచేతులా పట్టుకుని లోపలికి వెళ్ళాడు.

"నువ్వు గమ్మత్తులు చూపిస్తుంటే చూస్తూ కూచోవటానికి నాకవతల బోలెడంత పని వున్నది," అన్నది హనుమాయమ్మ.

అందుచేత ఆవిడకు ఎలెక్ట్రిసియక్ రావటం గాని, గదిలో రేడియోసెట్టు అమర్చటంగాని తెలీదు. చలపతి రేడియోను మోగించినప్పుడుకూడా ఆమోత ఇంకెవరింటో నుంచో వస్తున్నదనుకున్నది.

ఎప్పుడో కాలేజి నుంచి వచ్చి జానకివాళ్ళ భాగంలో కూచుని కబుర్లు చెబుతున్న లక్ష్మి, "రేడియో! రేడియో! మనింటో రేడియో!" అని ఎగురుకుంటూ వచ్చింది.

నెహ్రూకూడా ఎక్కడినుంచో బాణంలాగా వచ్చిపడుతూ తల్లిని చూసి, "మనింటో రేడియో ఎక్కడిదమ్మా? అన్నయ్య కొనుక్కొచ్చాడా?" అని గబగబా అడిగాడు.

"నాకు మటుకేం తెలుసూ? నాతో ఒకటి చెబుతారా, చేస్తారా? ఈ కొంపలో ఎవరి యిష్టం వారిదై పోయే! అందరూ అచ్చుపోసిన ఆంబోతులే! వెళ్ళి మీ అన్నయ్యనే అడగరాదూ?"

"ఖర్చు, ఖర్చు, డబ్బు ఖర్చు! ఖర్చు, ఖర్చు, డబ్బు ఖర్చు! పిసినారికి ఖర్చు, హెచ్చు ఖర్చు, ఖర్చు, ఖర్చు, ఖర్చు!" అని పాడుతూ లయ ప్రకారం నడుస్తూ నెహ్రూ లోపలికి బయలుదేరాడు.

"పళ్ళు రాలగొట్టేను, వెధవా!" అని వెనకనుంచి హనుమాయమ్మ ఆశీర్వదించింది.

అసలే ఆవిడకు మండిపోతున్నది. "అది" వీళ్ళందరికీ నేర్పుతున్నది. అసలే తనను చూస్తే ఎవరికీ లక్ష్యం లేదు. దానికి తగ్గట్టుగా "అది" వచ్చి తనకు పిసినారి అన్న బిరుదొకటి తగిలించి పోయింది. కాస్త డబ్బు జాగర్తగా వాడటం పిసినారితనమా? ఉన్నదంతా క్షవరం చేసుకొని, అడ్డమైన రేడియోలూ, బోడియోలూ కొని వందలూ వేలూ తగలేసుకుంటే, అప్పుడీ పక్షి తనను పిసినిగొట్టు అనకుండా వుంటుంది? అదేం వదిలేదికాదు. ఈ రేడియోను శీఘ్రంగా వచ్చినదారి పట్టించాలిసిందే. ఈ కొంపకు ఏదో ముసలం పుట్టింది. తాను నా కెందుకని చూస్తూ ఊరుకున్నదో వ్యవహారంఎంతదూరం పోయినా పోవచ్చు. కొంప గుండం వే!

హనుమాయమ్మగారు గదిలోకి వెళ్లింది, నిజంగా రేడియో పెట్టే!

ఆవిడకు తన చెవులలోకన్న కళ్ళలో ఎక్కువ నమ్మకం అని మనం అనుకోనవసరం లేదు. తనకు ఇష్టం లేని విషయాలను గురించి నమ్మవలసివచ్చినప్పుడు ఆవిడ మనసు పలుపుకట్టి లాగేబర్రెలాగాప్రవర్తించేది. రేడియో సెట్టు పెట్టిన పెట్టె చూసింది. రేడియో పాట విన్నది. అయినా కళ్ళారా రేడియోను ఏడడం ఆవిడ ప్రాణానికి మరొక సరిపడని సాక్ష్యాధారమనిపించింది. ఇట్లా సాక్ష్య

ధారాలు పేరుతుంటే తన మనశ్శక్తితో ఆ రేడియోను తుడిచిపారెయ్యటం ఎంత కష్టం.

రేడియో నిశ్చింతగా పాడుతున్నది; చలపతి దాని కెదురుగా నిలబడి, "ఇది ఇంతేనా ? లేక ఇంకా బాగా ఉండటానికి అవకాశం ఉందా?" అన్నట్టుగా మొగం చిట్లించి చూస్తున్నాడు. లక్ష్మి, నెహ్రూ తన్మయత్వంలో వున్నారు.

"డబ్బు పోసి కొన్నావుట్రా ? బోలెడంత కాలా ? ఇప్పుడు మన కిదొహటి తక్కువయిందిట్రా ః తిరిగి ఇచ్చేస్తే తీసుకోరూ ? ఈ పూటే ఇవ్వాలా? రేపియ్యొచ్చునా?" అన్నది హనుమాయమ్మ.

చలపతి ఆమెకేసి చూశాడుగాని అతని మనస్సు ఎక్కడో ఉన్నట్టున్నది. ఆమె అన్నమాట ఒకటీ అతని తలకెక్కలేదు.

"ఊరుకోవమ్మా, నీకొక్కటీ తెలీదూ!" అన్నది లక్ష్మి.

"అన్నయ్య కొనలేదమ్మా. ఊరికేనే వచ్చింది. ఇక మనింటనే ఉంటుంది," అన్నాడు నెహ్రూ పట్టలేని ఆనందంతో.

హనుమాయమ్మ ఆరాటం తగ్గటానికి బదులు హెచ్చింది. ఆవిడ లెక్కప్రకారం జీవితంలో మరీ అదృష్ట వంతమైన సంఘటనలకు తావులేదు. రేడియోసెట్లు ఊరికే రావటమూ, తన కొడుకులకు వేలకువేలు కట్నాలిస్తామని

సమ్మంధాలు రావటమూ, తన కూతుళ్ళను కట్నం లేకుండా చేసుకుంటామని ఎవరన్నా అనటమూ - ఇటు వంటివి జరగవు. అథవా జరిగినట్టు కనిపిస్తే దాని వెనక అంతకంత నష్టం దాగి ఉన్నదన్నమాటే. పువ్వు ఎంత సువాసన అయితేపొదలో అంతకంతగా ప్రాణంతీసే పాము లుంటై! అదే హనుమాయమ్మ తెలుసుకున్న జీవితసత్యం. ఎన్నోసార్లు రుజువైన జీవితసత్యం ! అందుచేత మరీ శుభ వార్తలాగా చెవినపడితే ఆవిడ మనసుకు ఆశ కలగటానికి బదులుగా ఆందోళన కలిగేది.

"ఊరికే వచ్చిందా? ఎవరిచ్చారు? ఎందుకిచ్చారు?" అన్నదావిడ ఆదుర్దాగా.

"సరోజినీవాళ్ళనాన్నగారు.... వాళ్ళింట్లో బోలెడన్ని సెట్లు!" అన్నది లక్ష్మి. 'హింకేం? అనుకున్నదంతా అయిందీ ! వాళ్ళు వీణ్ణి అర్భకుణ్ణిచేసి పిప్పరమెంట్లు పెట్టి బుట్టలో వేసుకుంటున్నారూ!'

భర్త ఇంటికి రాగానే హనుమాయమ్మగారు ఆయనతో లడాయి వేసుకున్నది.

"ఏమిటండీ ఇదంతా ? ప్రతీదీ నాకేనా పట్టిందీ ? మీకొక్కటీ పట్టదా ఏమిటి? ఆ కోదండరామయ్యగారు మన నందర్నీ పూర్తి వెధవల్ని చేస్తున్నారు ! నేను ఒక్కటే అడుగుతాను-మీరు రేపు తెల్లారుతూనే వెళ్ళి, మీ సమ్మంధం మాకొద్దు అంటానని వాళ్ళకు ఖచ్చితంగా చెప్పేస్తారా, లేదా?"

"చలపతి కావాలనుకుంటే మధ్య నువ్వూ నేనూ వద్దనట వేఁవిటీ? అయినా మనకెందుకక్కర్లేనీ సంబంధం?" అని ముసలాయన అడిగాడు.

"రామరామ! మీకు కళ్ళూ, చెవులూ కూడా కప్పేసుకుపోయినయ్యా? ఇది వట్టి దిక్కుమాలిన సమ్మంధం- కనిపించటంలా?"

"నిజంగా నాకళ్ళకేదో వచ్చేవుండాలి - నాకిది దిక్కుమాలిన సంబంధంవల్లే కనిపించడంలేదే?"

"నాకళ్ళింకా మూసుకుపోలేదుగా, నే నొక్కటడుగుతాను చెప్పండి! వాళ్ళసలు మన సమ్మంధానికెందు కొప్పుకున్నారూ? పిల్లకా బోలెడాస్తివుంది. నాకళ్ళకు మామూలు అందంగానే వుందిగాని, ఇంతా గొప్ప అందం అంటున్నారు గనక ఒప్పుకుందాం. ఇంతకంటె ఎంతో మంచి సమ్మంధాలు వాళ్ళకు రావచ్చునని ఎవరో అన్న మాట అక్షరాలా నిజం. అటువంటప్పుడు ఈ సమ్మంధంలో ఏదో తొర్ర లేకపోతే మనదాకా ఎందుకు వచ్చిందీ? దానికి ముందు సమాధానం చెప్పండి!"

"ఈ కాలంలో హోదాలకంటె మనుషులను పాటించే వాళ్ళు కొందరున్నారు. వాళ్ళకు చలపతి నచ్చాడని ఎందు కనుకోరాదూ?"

"అనుకోవటం దాకావస్తే మనం లక్షాధికార్లమనే అనుకోవచ్చు ఏకంగా! ఆ కబుర్లు నాదగ్గిర చెప్పకండి,

మనం మనవాణ్ణిగురించి ఏఁవనుకుంటున్నాఁవనేది కాదు. వాళ్ళేఁవను కుంటున్నారని!"

"సీగాడవే సీది.... వాళ్ళనుకునేదానిమాటే చెప్పాను. తమ కూతురికి మనవాడు తగిన మొగుడవుతాడని వాళ్ళ కెందుకనుపించగూడదూ అంట!"

"అట్టాదారికి రండి," అన్నది హనుమాయమ్మ, ఎలుకను పట్టుకున్న పిల్లిలాగా. "వాళ్ళమాటే అనుకున్న వాళ్ళయితే మనవాడికి తాయిల్లాలు పెట్టి మచ్చిక చేస్తున్నారెందుకో, మీరు నాకిప్పుడు చెప్పండి !" అని గద్దించి అడిగింది.

"తాయిల్లాలేఁటి ?" అన్నాడు ముసలాయన వింతగా.

"ఇవాల పొద్దున వాణ్ణి భోజనానికెందుకు పిలిచారూ? ఈ సాయంకాలం వాడాడుకోఁవటానికి రేడియో సెట్టెందు కిచ్చారూ? ... ఆ పాటంతా ఎక్కడి దనుకుంటు న్నారు? అదే!... ఆ పిల్ల పెళ్ళిమాటలైనా జరక్కుండా నేవాణ్ణిపూసుకుపూసుకు తిరుగుతుందేం,... మాట్లాడరేం, సంసారం చేసుకునే కొంపల్లో ఇటువంటి పచ్చికం జరగటం నే నెన్నడూ వినలేదు, చూళ్ళేదు!"

"నువ్వు విననివీ, చూడనివీ ప్రపంచంలో లక్ష లున్నై."

"ప్రపంచంలో ఎక్కడో ఉంటే నాకేం విచారం ? ఈ ముసలం మన కొంపలో ఎందుకు పుట్టాలీ అనే నా విచారమల్లా!"

నెహ్రూ రైలు వేగంతో వాళ్ళు మాట్లాడే చోటికి వచ్చి, "భలే తమాషా! సరోజిని రేడియోలోనే వేషం వేస్తున్నది. ఇప్పుడే చెప్పారు!" అంటూ మళ్ళీ అంత వేగంగానూ గదిలోకి వెళ్ళాడు.

వాడు చెప్పింది అర్థమైనాక హనుమాయమ్మగారి నెత్తిన మరో బుల్లి అణువుబాంబు పడ్డట్టయింది.

"ఎబ్బెబ్బెబ్బే! ఛీ ఛీ ఛీ ఛీ! దొరక్క దొరక్క మనపాలిటికి వేషాలేసేదే దొరికిందా? ఇహ అడగఖర్లా!" అన్నదావిడ. ఇంతకంటె ఎక్కువ జుగుప్స ప్రదర్శించటం నాకు సాధ్యంకాదు అన్నట్టుగా.

ఆవిడ వంటఇంట్లోకి వెళ్ళిపోయి, "ఎంతసేపు వింటారా దిక్కుమాలిన రేడియో ? అన్నాలకు అఘోరించండి!" అని కేకపెట్టింది. ఎవరూ జవాబు చెప్పలేదు. ఆవిడ చెవి ఒగ్గి ఆలకించింది. సరోజినిగొంతు తెలుస్తూనే ఉంది. "ప్రభూ ! నా ప్రేమను కలుషితం చెయ్యకండి, ఈ దీనురాలి మొర ఆలకించండి" అంటున్నది. "సిగ్గులేకపోతే సరి! ఛీ! .... పాడుతున్నది కూడాను? .... దానికి మానాభి మానాలు లేకపోతే వినేవాళ్ళకెందుకు లేకపోవాలి,"

"ఏంవర్రా? ఈ పూటకు అన్నంవూ, నీళ్ళూ అక్కర్లేదా యేం ? రేడియోతోనే కడుపు నిండినట్టుందే!" అని ఆవిడ మళ్ళీ కేక పెట్టింది.

"అమ్మ ఎంత విషం కక్కుతున్నదో !" అన్నాడు నెహ్రూ చిన్న గొంతుతో.

హనుమాయమ్మగారి ఆవేశంలో మనకు అసందర్భంగా కనపడేది ఒక్క అంశం ఉన్నది. ఆవిడ సరోజిని తన కోడలు కాకుండా చూడాలని దృఢంగా నిశ్చయించుకున్నది. అయినా ఆమె అప్పుడే తన కోడలు అయిపోయినట్లూ, తనకు అవమానం తెచ్చే పనులు చేస్తున్నట్లూ భావించుకుని బాధపడింది. అయినా ఇందులో కొంత అర్థం లేకపోలేదు. ఆవిడ దేన్నయినా ప్రతిఘటించదలుచుకున్నప్పుడు అందుకోసం తనకున్న సర్వశక్తులూ కేంద్రీకరించుకునేది. సరోజిని తనకు కోడలైవుంటే ఎంత బాధపడగలదో అంతా ముందుగానే పడితే ఆమె తన కోడలుగా కాకుండా చూడటానికి తన కంతగా శక్తి వస్తుందని ఆవిడ నమ్మకం. ఇందువల్ల ఆమెకు ఒక లాభంకూడా వుండేది—తీరా ఘర్షణలో ఓడిపోవటం జరిగితే ఆవిడకు ప్రత్యక్షంగా జరిగే బాధ తాను ఊహించుకున్న దానికంటె కాస్త తక్కువే ఉండటంచేత త్వరలోనే ఆవిడ మనస్సు ఆ పజయాన్ని ఆమోదించగలిగేది.

# 7

మర్నాడో నాడు ఉదయం అంత పొద్దెక్కి సరోజిని మళ్ళీ వచ్చింది.

'ఈ శని ఇక రోజూ ప్రత్యక్షమవుతుందల్లేవుంది.' అనుకున్నది హనుమాయమ్మ.

"అది" నిజంగా వీళ్ళమీద ఏదో మచ్చుమందు చల్లేవుండాలి—లేకపోతే "అది" రాగానే లక్ష్మికి ముడ్డి మీద గుడ్డ నిలవకపోవటంవేం? దానికన్నా తను ఎక్కువ చదువుకుందిగదా, అది తన అడుగులకు మడుగులొత్తాలా, దాని అడుగులకు తాను మడుగులొత్తుతుందా? నెహ్రూ అంటే పోనీ చిన్నవాడనుకోవచ్చు!....అడుగో, ఆ చలపతి గాడుకూడా తయారూ—కోతల్లే ఇకిలిస్తూ! వీడి ఇకిలింపు యిదైపోనూ?

హింకేం? మళ్ళీ పిప్పరమెంటు బిళ్లలు తెచ్చింది!... తొట్లల్లో పూలమొక్కలు? లక్ష్మి చేతులుజోడించి వాటికి దణ్ణాలుకూడా పెడుతున్నది!... అది అల్లాఉచ్చులువేస్తుంటే వీళ్ళు తెలుసుకోరేం!....

"చూడు లక్ష్మి, ఈ ముదురురంగు ఆకులది నిగ్రెట్ గులాబీ, పూలు నెత్తురురంగులో ఉంటై. జాగ్రత్తగా పెంచితే బోలెడుపూలు పూస్తుంది. ఈ రెండోది తెల్లరోజా—

ఇంతో గులాబీ వాసనుంటుంది. ఎప్పుడన్నా ఫిల్టరు కాఫీ పొడి వేస్తూఉండు. అంతకంటె ఎరువక్కర్లేదు. కావలసిన ఎర్రమన్ను, ఇసకా తొట్టెలోఉంది. నీళ్లు వేలంవెర్రిగా పొయ్యక్కర్లేదు. ఎండలు ముదిరేదాకా ందు మూడు రోజులకొకసారిపోస్తేచాలు," అని సరోజిని లక్ష్మికి చెప్పింది.

"ఇవాళమాకు శలవేగా. సాయంకాలందాకా ఉండి పో," అన్నది లక్ష్మి.

"ఉండిపోవటానికేగదా వచ్చాను," అన్నదిసరోజిని.

"హాసి. నీ కడుపుడకా!" అనుకున్నది హనుమాయమ్మ. దీని అసూయిత్యానికి అంతూపొంతూ ఉన్నట్టు కనిపించలేదు. వంటచెయ్యటమూ, పెట్టటమూ చాకిరీ తనది గదా, ఇదివచ్చి కొంపమీద గద్దలాగా వాలుతుంటే తనకు అందరికన్నా ఆలస్యంగా తెలియునా? తనుకూడా దాని చుట్టూ తిరిగి భజన చేస్తేగాని తనతో ఏమీ చెప్పదు గాంవోలు! అదుగో, కొలుపుసాగింది.

"సర్లే, రాత్రి నీ నాటకం భలేబాగుందనుకో! పాట కూడా భలే బాగుంది!" అన్నది లక్ష్మి.

"అన్నయ్యా, అక్కా, నేనూవిన్నాం. అమ్మ వంట చేస్తూవిన్లేదు" అన్నాడు నెహ్రూ.

"ఆవిడకేనాటకాలేం బాగుంటై!" అన్నది సరోజిని.

"ఆ మాటన్నావు బాగుంది!" అనుకున్నది హనుమాయమ్మ. "అది" తనకు నచ్చినమాట ఏదన్నా అన్నప్పు

డల్లా భూమిపైకిపోయి, ఆకాశం కిందికి దిగిపోయినట్లనిపిస్తుందావిడకు.

ముసలాయనకూడా వచ్చాడు. భజనకు - చిరత ముక్కలులేవు. "చూడమ్మాయ్, నిన్నరాత్రి పుస్తకంవల్లే పడుకుని నిద్రపోయాను. మీ నాన్నతో చెప్పు, మందు నమ్మకంగా పనిచేస్తున్నదని. ఇంకోడోసివ్వమని ఎంతబతిమాలినా ఇచ్చాడుకాదు."

"అక్కర్లేదండీ, మొదటిడోసు పనిచేస్తున్నంతకాలమూ మళ్లీ మందు వేయరాదు.

ఒక్కమోతాదులోనే ఇన్నేళ్ల రోగమూ ఇట్టే నయమవుతుందీ!"

"అంత సులువుగా నయమైతే ఇకలేందేం ? ఇంకా మందివ్వాలి, మందు మార్చవలసికూడా రావచ్చు"

జానకికూడా వచ్చింది! సభ భర్తీ అయింది!

"రాత్రి మీనాటకం విన్నాంలేవమ్మోయ్. నేనలా చక్రవర్తిగారింటి కెళ్ళితే వాళ్ల రేడియోలో నాటకం వచ్చింది. నీపేరు చెప్పాగుగాని అది తలకెక్కలేదు. గొంతు వింటే అనుమానం వేసింది. పాడేసరికిరూఢిఅయింది. నిన్న పొద్దున కనపడ్డప్పుడుకూడా చెప్పలేదేం ? ఇదేనా మొదటి సారి రేడియోలో వేషంవెయ్యటం?"

"కాదండీ. ఏడాదినుంచీ అప్పుడప్పుడూ రేడియోకు వెళుతూ వేడున్నా, ఇది నాలుగోసారి అనుకుంటా."

"డబ్బిస్తారా?"

"ఇస్తారండీ! ప్రోగ్రాం కాగానే చెక్కిచ్చేస్తారు."

చలపతి తల్లిదగ్గరకొచ్చి, "అమ్మా, సరోజిని కూడా వంట చెయ్యి, భోజనానికుంటుందిట," అన్నాడు.

"చేస్తారా? నేనున్నదెందుకూ? వంట చెయ్యటానికేగా? భోజనానికి ఉండటమేంఖర్మ? ఏకంగా ఉండిపొమ్మన్నా ఉండిపోతుంది!" అన్నది హనుమాయమ్మ అక్కసు అణుచుకోలేకుండా.

"ఆ విషయాలు మనలో మనం మాట్లాడుకుందాం"

"నాక్కేం భయమట్రా నా జన్మలో నన్నెవరూ భయపెట్టలేదు ఈ బొట్టికాయను చూచి దడుచుకోవాలంటావా ఏం?" అన్నది తల్లి గట్టిగా.

చలపతి ఒక్కసారి నేలకేసిచూసి, మళ్ళీ తల్లికేసిచూసి ఏదో చెయ్యబోయేవాడల్లే కదిలి, "సరే. నువ్వు వంట చెయ్యొద్దులే, మేం హోటలుకు పోతాం," అన్నాడు.

"పొండి, బెదిరిస్తారా? మేం వంటే ఎవరెవరు?"

"నాన్న సంగతి నాకు తెలీదు-మిగిలిన వాళ్ళం."

ముసలాయన లేచివచ్చాడు. పెళ్ళాన్ని నానా మాటలూ అన్నాడు. ఆవిడ మళ్ళీ రెండన్నది. చలపతికూడ అనదలచిన మాటలన్నీ అన్నాడు. ముగ్గురూ చేరి కాట్లకుక్కలల్లే పోట్లాడుకున్నారు.

హనుమాయమ్మ అభిమన్యుడిలాగా యుద్ధం చేసింది. మగవాళ్ళమాటలకు మాటలు చెప్పించటమే కాక

సందర్భాన్నిబట్టి వాళ్ళులోగడ చేసినవీ, అన్నవీ వప్పగిం చింది. ("అదివరకు ఈమాటఅన్న మనిషేగా!....పుల్లమ్మ పిన్ని ఉత్తరంవచ్చినప్పుడీ పనిచేసిన మొహంగాదూ....ఈ మాటలు వినీ వినీ చెవులు తడికలు కట్టినై!....నా కంతా తెలుసు! ఎవరేం చెప్పనక్కర్లేదు....") దాంతో బాటుగానే వర్తమానాన్ని గతంతోపోల్చి భవిష్యత్తును ఊహించ సాగింది, ("ఏడీ రెండురోజుల్లోనూ పిచ్చికుక్కల్లే తయారై నాడు గానీ, అంతకుముందు ఇది లేదు. చాతబడిచేశారు–చాతబడి!....ఈయన తానై ఎన్నిమాటలన్నా వీధిలో పోయ్యేవాళ్ళను వెనకేసికొచ్చి నన్నెన్నడూ అన్నది లేదు. కాలానికేదో విపరీతంపుట్టుకొచ్చిందిమరి....ఇంకా రెక్కలు విరుచుకుని ఇంటిచాకిరీఅంతా చెయ్యగలిగిన స్థితిలో ఉండ గానేనన్నింత తీసిపారేస్తున్నారే. కాళ్ళూ, చేతులూపడిపోతే ఇంకేం చేస్తారో? (ప్రాణాలుపోకుండా నేపాడికట్టేస్తారో,ఏమో)

లక్ష్మి నిశ్శబ్దంగా ఏడవసాగింది. సరోజిని తనమీాద చెయ్యివేస్తే మొహంఎత్తి ఆమెకేసి చూడలేకపోయింది.

సరోజిని చలపతిని దగ్గరికి పిలిచి, "మీారంతా కలిసి ఆవిడను ఎందుకు క్షోభ పెడుతున్నారు. ఆవిడ మనసులో ఏదో బాధలేకపోతే అట్లామాట్లాడరు. ఆ బాధ వెళ్ళ గక్కుకోనివ్వండి, తరవాత మనసు శాంతిస్తుంది," అన్నది.

చలపతి ఇంగ్లీషులో, "ఆఁ, నీకు తెలీదు — ఈనరకం నాపుటకల నుంచి అనుభవిస్తున్నాం. దీనికి ఎక్కడో ఒకచోట బ్రేకు వేసితీరాలి," అన్నాడు.

"నేను చెప్పింది మీకు అర్థం కావటంలేదు—టెంపర్ లూజ్ చెయ్యటంలో ఆవిడతో పోటీపడకండి. ఇటువంటి సందర్భాలలో ఒకరు ఉద్రేకం తెచ్చుకున్నప్పుడు మరొకరు శాంతంగా ఉండటం మంచిది." అన్నది సరోజిని.

ఆ మాట హనుమాయమ్మకు అర్థమయింది.

"నీ బోడిసిఫార్సులు నాకేం అక్కర్లేదు. మాలో మేం తిట్టుకుంటాం, తన్నుకుంటాం. మధ్య నువ్వెవరు? నీ మూలంగానే కొంపకు చిచ్చువచ్చిందని ఇప్పుడన్నా తెలుసుకో. నిక్షేపంవంటి నాకొడుక్కు మందు పెట్టావ్! నన్ను వాడికి పగదాన్ని చేశావ్!" అన్నదావిడ.

అప్పటికి చాలామంది చేరారు. అందరూ తనను చూసి అసహ్యించుకుంటున్నారని హనుమాయమ్మకు తెలుసు. అందుకావిడ సిగ్గుపడలేదు—గర్వపడ్డది. ఈ అల్లరీ, అఘాయిత్యమూ చెయ్యటానికే ఆవిడ మూడురోజులుగా కాలుదువ్వుతున్నది. ఆ ఏడుకొండలవాడి దయవల్ల ఆ అవకాశం ఇప్పుడు దొరికింది.

తనచేత ఆమాట అనిపించుకున్నాక "అది" మంచువిచ్చినట్టువిచ్చిపోయి మరీ తన గడపలో అడుగుపెట్టదని ఆవిడ ఆశించింది. కాని సరోజిని మొహాన ఒక వెటకారపు చిరునవ్వు కనిపించేసరికి. ఆవిడకేదో భయం కడుపులో సన్నగా ప్రారంభమయింది.

"నే నెవరినని అడిగారు. నే నీయనకు కాబోయే [illegible] రిజిస్ట్రారు దగిర అప్లికేషన్ వేసివచ్చాం

ఇద్దరమూ వెళ్ళి. మీ కిష్టంలేకపోతే నన్ను కోడలుగాచూడ నవసరంలేదు. ఇందులో బలవంతపుబంధుత్వం ఏమీలేదు. ఇంకో గంటు వారాలకు మాకు పెళ్ళిఅవుతుంది. ఇష్టమున్న వాళ్ళు రావచ్చు," అంటూ సరోజిని బయలుదేరింది వెళ్ళి పోవటానికి.

తల్లివంక అసహ్యంగాచూసి చలపతికూడా ఆమె వెనకనే బయలుదేరాడు. లక్ష్మికూడా అన్నకుకొంచెం వెనకగా వెళ్ళింది. వాళ్ళు ముగ్గురూ మళ్ళ తిరిగిరాలేదు. హనుమాయమ్మ తాను ఇంత పరాభవం పొందుతానని కలలోకూడా అనుకోలేదు, ఆవిడ పిచ్చికుక్కల్లే ప్రవర్తించి నందుకు కుంగిపోలేదు. అందరూ తనకేసి రాక్షసిని చూసి నట్టు చూసినందుకు పశ్చాత్తాపపడలేదు: ఇంతాచేసిచలపతికి "దానికి" పెళ్ళికాకుండా చెయ్యాలేకపోయినందు కావిడ చితికిపోయింది.

"అది" రిజిస్ట్రారన్న దేవిటో తనకుఅర్థంకాలేదు. కాని చలపతి ఏదో చేసివచ్చాడు !

ఆవిడ ముసలాయనకేసితిరిగి, "రిజిస్ట్రారంటుందేవిటి?" అన్నది.

"దాన్నే అడక్కపోయావ్? నాకేం తెలుస్తుంది?"

తెలుసుగాని చెప్పడు.

ఆవిడ కొడుక్కేసి చూసింది.

"నన్నడక్కు — నాకసలు తెలేదు." అన్నాడు

[illegible]

# 8

ఆ సాయంకాలం బాగా చీకటిపడి లక్ష్మి, చలపతీ తిరిగి వచ్చారు.

"బాగా విందులు మెక్కబెట్టారా?" అని అడిగింది హనుమాయమ్మ, మామూలు ధోరణిలో - ఆ ఉదయం ఏమీ జరగనట్లు.

వాళ్ళు జవాబు చెప్పలేదు. లక్ష్మి "నరకం" అని గొణుక్కున్నది. అంతకు మునుపునుంచే ముసలాయనా, నెహ్రూ ఆవిణ్ణి వెలిలో వుంచి, మాట్లాడటం మానేశారు. కాని అందరూ తమ తప్పు తెలుసుకుని తన దారికే వస్తారని ఆవిడ ఆశ. దేవుడి దయవల్ల ఇంతవరకూ వాళ్ళు తనతో రాజీపడుతూనే వస్తున్నారు.

అయితే ఈసారి వ్యవహారం ముదురుపాకాన పడింది. రెండు రోజులు గడిచినా మనుషులలో మార్పు లేదు.

హనుమాయమ్మగారు మొదట్లో ఏమీ జరగనట్లు పెట్టినపోజు పనిచెయ్యకపోయేసరికి సాధింపుకు దిగింది. "నేనేమీ చెయ్యను. ఎందుకు చెయ్యాలి!" అని భీష్మించింది.

పొద్దున్నే లేచి కాఫీ పెట్టలేదు. ఆ సంగతి తెలియగానే చలపతీ, లక్ష్మి వంటఇంట్లో ప్రవేశించి కాఫీచేశారు. "వాళ్ళు అన్ని వంటచేస్తున్నారా, లేదా!" అని అడిగారు.

"కాఫీ చేసుకున్నవాళ్లు వంట చేసుకోలేరా"? అన్నది. ఇద్దరూ వంట కూడా చేశారు.

హనుమాయమ్మ వాళ్ళొచ్చినప్పుడు తాగక తర్వాత తన చేతిమీదుగా చేసుకు తాగింది. వంట గురించే ఏం చెయ్యాలో ఆవిడకు తెలియలేదు. తాను పస్తు పడుకుంటే వాళ్ళకు బుద్ధి వస్తుందా? వాళ్ళు చేసినవంట తింటే తనకు మరెంత అపజయమేవో.

సాయంత్రం గంటలదాకా ఆగి ఇంటో ఎవరూ లేకుండా ఉన్నప్పుడే సమయంలో జానకిని ఎదురుగా కూచో బెట్టుకుని భోజనం చేసిందావిడ.

"అయితే చూడు – జానికమ్మ తల్లీ! ఈ పెళ్ళి నిజంగా అవుతుందంటావా? ఊరికే నన్ను బెదిరించటానికి అన్నదా?" అని అవిడ అడిగింది.

"పెళ్ళి కాపటానికేమండీ! నిక్షేపంగా అవుతుంది. ఆ రిజిస్ట్రారు ఇంటికివచ్చి మరీ పెళ్ళిచేసి పోతాడు," అన్నది జానకి.

"పెళ్ళికి పిల్లవాడి తల్లిదండ్రులు కూడా పీటలమీద కాస్సేపు కూచోవాలేవో!"

"పీటలూ వుండవు, చాటలూ వుండవు."

"తాళి గట్టటాలూ, తలంబ్రాలూ అయినా వుంటయ్యా!"

"అవేమీ వుండవు, అంతా పది రూపాయలతో పెళ్ళి అయిపోతుంది."

"పది రూపాయలు పురోహితుడికే చాలవే!"

"పురోహితుడుండడు. పురోహితుడి పని రిజిస్ట్రారే చూసాడే."

"అయితే ఆ రిజిస్ట్రారుకు మంత్రాలు వచ్చా వేమిటి?"

"ఈ పెళ్ళికి మంత్రాలూ, తంత్రాలూ, ఏమీ వుండవు."

"అయితే ఇది కిరాస్తానం పెళ్ళిగావాలు!" అన్నది హనుమాయమ్మ ముక్కు మీద వేలేసుకుని.

కాస్సేపు ఎవరి ఆలోచనలో వాళ్ళున్నాక హనుమాయమ్మ, "చూశావా జానకమ్మా! ఇంటిల్లిపాదీ నా మీద కత్తి గట్టారు. నువ్వంతా చూస్తూనే వున్నావుగా! నే నన్న మాటలు తప్పేవిటో చెప్పు! నా వల్ల తప్పుంటుందంటే చెప్పుతో కొట్టించుకుంటాను!" అన్నది.

"ఎవరితప్పూ లేదులెండి పిన్నిగారూ! మీరు అసలు విషయం తెలియక తొందరపడ్డారు. ఏమన్నా అనదలిస్తే మీ అబ్బాయిని మీరు అనుకోవచ్చుగాని, ఆ అమ్మాయి ననటం అనవసరం."

"నను తెలీదు జానికమ్మ తల్లీ! నా కొడుకు అసలు అటువంటివాడు కాడు అని వాడికేదో మందు పెట్టింది—సిరికోడు!"

"అక్కడే మీరు పొరబడ్డారు. మీ అబ్బాయికీ దాదాపు ఏడాదినుంచీ పరిచయం వున్నది. మీ కేమైనా తెలుసా?"

హనుమాయమ్మ ఈ మాట విని నిశ్చేతనురాలై పోయింది.

"ఇది నిజమేనా? నమ్మొచ్చా?" అని అడిగింది చివరకు.

"ఆ అమ్మాయే చెప్పింది. అబద్ధం చెబుతుందా?"

హనుమాయమ్మ కాస్త ఆలోచించి, "అందుకా వీడు ఆ నెల్లూరు సమ్మంధమూ, కయితేపిల్లి సమ్మంధమూ వద్ద చేశాడూ? చూశావా, వాణ్ణి అది వలలో వేసుకుం దని ఇప్పుడన్నా నమ్ముతావా?"

"అలా అనటానికి లేదులెండి. మీ అబ్బాయిక్కీ, ఆ అమ్మాయికీ పెళ్ళవుతున్నదంటే ఎవరైనా మీ అబ్బాయికి మంచి సంబంధం వచ్చిందంటారు,గాని, ఆ అమ్మాయికి మంచి సంబంధం వచ్చిందనరు. లోకంమాట చెప్పాను సుమండీ! ఆ అమ్మాయి తానై మీ వాణ్ణి ఏరుకున్నది గాని, ఈ పెళ్ళే వాళ్ళ పెద్దవాళ్ళు చేసి ఉంటే మీ దగ్గరికి వచ్చి ఉండేవారే కారేమో? ఇంకా పెద్దెత్తు సంబంధాలు చూసి ఉండేవాళ్ళనుకుంటా."

జానకిని చూస్తే హనుమాయమ్మకు మండిపోయింది. 'వాజ! నోటికి వచ్చినట్టు మాట్లాడుతున్నది!' అనుకున్నది.

కాని ఆ అభిప్రాయం తన కడుపులోనే దాచుకున్నది. అవిడ కొక గొప్ప ఆలోచన తట్టింది — "కోటిగాడికి" ఉత్తరం వ్రాయాలి. అంటే జానకి చేత రాయించాలి. జానకి చేత రాయించడంవల్ల చిక్కులు వస్తాయేమోనని ఆవిడ ఒక్క క్షణంపాటు జంకిందిగాని, మీన మేషాలు లెక్కించడానికి ఇది సమయం కాదని తేల్చుకున్నది.

"జానికమ్మ తల్లీ, ఒక్క సాయంచేసి పెట్టాలి. మా పెద్దవాడికి ఒక్క ఉత్తరముక్క రాసిపెడతావ్?" అన్నదావిడ.

జానకి సరేనన్నది.

హనుమాయమ్మగారు ఒక ముక్కు ముక్కి లేచి వెళ్ళి గది అంతా ఘాలించి ఒక కార్డు తెచ్చింది.

"చూడమ్మా మా వాడికి ఈ పెళ్ళిమాట రాయాలి. వాళ్ళకు తెలీకపోతే ఎట్లా? ఈ పెళ్ళి మూలంగా కొంపంతా ఒక కొలిక్కి వచ్చిన సంగతికూడా రాయాలి!" అన్నదావిడ.

"మీరు ఒకొక్కవిషయమే చెప్పండి. రాస్తాను!" అన్నది జానకి.

రాయటానికి పెనసలు ఒకంతట దొరకలేదు. జానకి తమ ఇంట్లో పెన్నున్నదని చెప్పింది. ఇద్దరూ కలిసి జానకి వాళ్ళ భాగానికి వెళ్ళి కూచున్నారు. ఆ కాస్త కార్డు ముక్క నించటానికి గంటకు పైగా పట్టింది. జానకి తన

సొంతం ఏమీ పెట్టకుండా వీలయినంతవరకు హనుమా యమ్మగారి నోటిమాటలే రాసింది.

రాతపని పూర్తి అయినాక హనుమాయమ్మ "చూడు, జానికమ్మతల్లీ! ఈ భాగ్యానికి మా వాళ్ళకు తెలియటం దేనికిగాని, మీ పనిమనిషి రాగానే కార్డు పోస్టు డొక్కులో వేయించు. ఈ విషయం ఎవరితోనూ అనకేం!" అన్నది.

73

# 9

హనుమాయమ్మగారు కోటేశ్వరరావుకు రాసిన ఉత్తరం చేరేసరికి అతని భార్య ఇంట్లో ఉన్నది. అతను లేడు. అతని భార్య కృష్ణ కార్డు చదువుతున్నది. తన అత్త గారికి మంచి శాస్తి జరగబోతున్నదని సంతోషించింది.

తరవాత కోటేశ్వరరావు వచ్చినప్పుడు కార్డు చూపించి, "మనకు పెళ్ళి ప్రయాణం తగిలేట్టుందే," అన్నది.

తల్లి ఉత్తరం చూసి కోటేశ్వరరావు చీదరించు కున్నాడు. అసలు విషయమంతా చలపతి ఆ కిందటిరోజే అతని ఆఫీసుకు రాశాడు.

"ప్రపంచమంతా మారినా యీావిడ మారదు" అన్నాడు కోటి.

"పాపం, ఆవిడకు జవాబు రాయండి" అన్నది కృష్ణ.

"నేను రాయను. ఈ ఉత్తరానికి జవాబేఁవిటి?" అన్నా డతను.

"అయితే నేను రాస్తాను. కవరొకటి ఇవ్వండి" అన్నది కృష్ణ.

"ఏం రాసావు?"

"ఏదో ఆవిణ్ణి కాస్త ఊరడిస్తూ రాస్తాను. అంతే కన్నా ఏం రాస్తాను?"

హనుమాయమ్మకు కోడలి ఉత్తరం చూడగానే పంచప్రాణాలూ లేచి వచ్చినట్లయింది. ప్రపంచంలో కాస్త బుద్ధివున్న మనిషంటూ ఉంటే తన పెద్దకోడలేనని ఆవిడ ఆ క్షణంలో శ్లాఘ చేసుకున్నది.

ఆవిడకు తన కోడలి మీద నిన్న ఈ అభిప్రాయం లేదు. మళ్ళీ రేపు ఉండకపోవచ్చు. మనుషులను గురించి ఎప్పటికప్పుడు కొత్తగా అభిప్రాయా లేర్పరచుకొంటూ ఉండటం అవిడకు పరిపాటే. ఒక్క గంటలోనే జానకి ఆవిడకు ఎంత ఆప్తురాలల్లేనూ, ప్రబల విరోధిగానుకూడా ఎన్నోసార్లు కనిపించింది.

కృష్ణ తన అత్తగారి మీద ఎక్కడలేని సానుభూతి ఒలకబోసింది. చలపతి ఆవిడకు సమ్మతంగాని సమ్మంధం ఆవిడకు తెలియకుండా నిశ్చయించుకొనటం కొంచెం కూడా సబబుగా లేదన్నది. ఇంటిల్లిపాదీ ఆ బయటిమనిషిని వెనకేసుకొచ్చి ఆవిడ మీద కత్తికట్టటం పెద్ద పొరపాటని ఒప్పుకున్నది. పెళ్ళికి వచ్చినప్పుడే విషయాలన్నీ మనసు విప్పి మాట్లాడతా నన్నది.

పెద్దకొడుక్కు రాసినట్టే హనుమాయమ్మగారు జానకి చేత తన పెద్దకూతు ళ్ళిద్దరికీ రాయించింది. వాళ్ళలో పెద్దది జవాబివ్వలేదు. రెండోది వట్టివెఱ్ఱవన్నర ఉత్తరం

రాసింది. "ఇన్నేళ్ళు వచ్చినా నీ బుద్ధి మారకపోవటం ఆశ్చర్యంగా ఉంది. హాయిగా క్రిష్ణా, రామాఅంటూ ఒక మూల పడివుండక అన్నీ నీమీద ఎందుకు వేసుకుంటున్నావు? అందరూ నీకు ఎదురుతిరిగాక, నీ మాట సబబే అయితేమటుకు లాభమేమిటి? నీ సంగతి నాకు బాగా తెలుసు గనక తప్పంతా నీదేనని నేను అనుకోవాలిసి వస్తున్నది. చలపతి అన్నయ్య ఎంత చెడ్డా తెలిపితేటలలో నీకు తీసిపోడు. అటువంటివాడి బ్రతుకు నువ్వు తీర్చి దిద్దేదేమిటి? ఈ కాలపు కోడళ్ళు అణిగి పడి ఉంటారనుకుంటున్నావా? నీవంటివాళ్ళకోసమే సక్కుబాయి అత్తగారి పాత్ర సృష్టించారు. ఇప్పటికన్నా తెలుసుకో, ఇటువంటి పేచీలుపడే పెద్దకోడల్ని, కోటి అన్నయ్యనూ నీకు కాకుండా చేసుకున్నావు. మళ్ళీ అదే గోతిలోకి పడాలని చూస్తున్నావు. చలపతి అన్నయ్యనుకూడా దూరం చేసుకుంటే నువ్వు చాలా కష్టాలు పడతావు. చిన్నదాన్నయినా నీ మేలుకోరి ఈ విషయాలు చెప్పటమయింది. ఎవరిబ్రతుకు వాళ్ళను బతకనీ; అదేనీకు నాసలహా. ఈసలహాకూడా నువ్వుఅడిగావు గనక చెప్పాను."

"ఏడవ లేకపోయింది! గుడ్డొచ్చి పిల్లను వెక్కిరించిందిట." అనుకున్నది హనుమాయమ్మ, ఆ ఉత్తరం చూసుకుని.

పోట్లాట జరిగి వారమయింది. ఇంట్లో పరిస్థితి మామూలు అయినట్టే హనుమాయమ్మగారికి తోచింది.

("ఒక్కప్పుడీ వెధవకొంపలో ఇంతకన్న అపేక్షలు అఘో రించినయ్యా ఏమిటి?") రెండురోజులు అందరూ తనను వెలివేశారు. ఆ తరువాత "చచ్చినట్టు" దారికి వచ్చారు! రాకేం జేస్తారూ? ఊళ్ళోవాళ్ళను వెనకేసుకొచ్చి తనను తప్పు పట్టగానే సరా! తన చాకిరీ, నిర్వహణమూ లేకుండా వాళ్ళకి ఒక్క ఘడియ జరుగుతుందీ?

తాను ఇంట్లో పూర్తివిజయం సాధించానసే హనుమాయమ్మ అనుకున్నది. ఆవిడకు ఒక్కటి మాత్రం అర్థం కాలేదు-ఎవరూ పెళ్ళిమాట ఎత్తరు; బెల్లం కొట్టిన రాళ్ళల్లేకూచున్నారు. ఏఁవవుతున్నట్టు? అసలేఁవన్నా అవు తున్నదా లేక అంతా చల్లారిపోయిందా? "అది" తనని అదరగొట్టటానికి చెప్పివుంటుందిగాని, రిజిస్ట్రారూ, అదీఅంతా అబద్ధమై వుంటుంది.... కాని జానకి కూడా చెప్పిందే.... "అది చెప్పినదే నిజఁవైతే ఇంకో వారంలో పెళ్ళి జర గాలిగా? కొంచెమన్నా కదలిక లేదేం? పెళ్ళంటే మాటలా? ఎన్ని కొనాలి, ఎంత చెయ్యాలి, ఎంతమంది సాయం కావాలి? బారసాల కుండేపాటి హడావుడన్నా లేందే?.... వట్టిది, ఈ పెళ్ళి జరగదు! తాను వేసిన బ్రహ్మాస్త్రం పారింది. అందుకే అందరూ కుక్కినపేలల్లే అయిపోయినారు, వాళ్ల పంతాలే నెగ్గివుంటే ఈ పాటికి తాపామర్పాలు వాంచకపోయినారా?

హనుమాయమ్మ దాదాపు రెండురోజులపాటు నిర్వి కల్పానందం అనుభవించింది. ఆ ఆనందంలో ఆవిడలక్ష్మిని

"అమ్మాన్ లక్షుమ్మ తల్లీ!" అనీ. కొడుకును "నాయనా నెహ్రూ!" అనీ ఎంతో ఆపేక్షగా సంబోధించింది. ఒక రోజు రాత్రి ముసలాయన మామూలు ప్రకారమే బాధ పడుతున్నట్టు కనిపించేసరికి, "నే చెప్పలా? ఆ పంచదార మాత్తర్లు పనిచేస్తయ్యా! వొట్టిది, మీరు లేనిపోని ఆశలు పెట్టుకోకండి! ఇది న్యాయంకాదు," అని ధైర్యం చెప్పింది ఆపేక్షగా.

అంటే, ఆ మర్నాడే "కోటిగాడు" సకుటుంబంగా వచ్చి దిగాడు.

"ఒక్క కార్డుముక్కయినా రాయకుండా ఇట్లా అర్జెంటుగావచ్చి దిగావేంవిట్రా?" అన్నది తల్లి.

"చలపతి పెళ్ళి ఇంకా మూడురోజులేగా ఉందీ? రెండువారాలుసెలవు తీసుకుని వచ్చేశాం," అన్నాడుకోటి.

హనుమాయమ్మకు నోట మాట లేదు. రెండు నిమిషాలపాటు ఆవిడ కథలో రాజకుమారుడల్లే శిల అయి పోయింది.

అయితే ఇంకా సవ్యంగా నడుస్తూనే ఉందన్న మాట! తనకు తప్ప అందరికీ తెలుసూ!....అయినా, దింపుడు కళ్ళాశతీరక. "పెళ్ళని నీ కెవరు రాశారేం?" అని ఆవిడ కొడుకు నడిగింది.

"ఎవరు రాయటంవేవిటమ్మా? శుభలేఖ వస్తేనూ!" అన్నాడు కోటి విసుగ్గా.

"అచ్చు శుభలేఖే? కోసలకు పసుపురాసివచ్చిందీ?" అన్నది తల్లి కొడుకు తెలివితేటలను చూస్తూ చూస్తూ నమ్మలేక.

కోటిజవాబు కూడా చెప్పలేదు. అతగాడి ప్రవర్తన ఆవిడకు నచ్చలేదు. అయినా, వాడితో తన కేంవిటి ? తనని పూర్తిగా అర్థం చేసుకుని తన పక్షాన ఘట్టిగా నిలబడటానికి కొండంత కోడలుండగా !

"ఏంవే, కిష్టాక, ఎట్టా వున్నారు నువ్వూ, పిల్లలూ? కిందటిసారి చూసిందానికన్న నీకు రంగొచ్చిందేవ్ ! కోటి మామూలు నేడున్నాడు గాని నువుమటుకురంగొచ్చావ్. మొత్తానికి ఆ పూనా నీరూ, తిండీ నీకు బాగా పడింది!" అంటూ ఆవిడ కృష్ణకు "తైరు" కొట్టింది. లోగడ తాను కృష్ణను అన్నమాటలు ఒక్కటీ ఆవిడకు జ్ఞాపకం లేదు. కృష్ణ వాటిని జాపకం పెట్టుకుంటుందని ఆవిడకు తట్టను కూడా లేదు.

కోటి స్నానంచేసి బట్టలు మార్చుకుంటుండగా ముసలాయన, "పెళ్ళివారింటికి పోదాం వస్తావుర్రా?" అని అడిగాడు. వ్యాధి లక్షణాలు మళ్ళీ కనిపిస్తే చెప్పమని కోదండరామయ్య ఆయనతో మందిచ్చేనాడు అన్నాడు. కిందటిరాత్రి అంత బాగా నిద్రపట్టలేదు. దురదృష్టవశాత్తు అది హనుమాయమ్మ కంటపడింది.

తండ్రీ కొడుకు లిద్దరూ "పెళ్ళివారింటికి" వెళ్ళిపోయారు.

కృష తనపిల్లలిద్దరికీ నీళ్ళుపోసి తాను తలకు నానె పెట్టుకుంది. అదిచూసి హనుమాయమ్మ బుట్టలోనుంచి కుంకుడుకాయలు తీసి కొట్టసాగింది. వాటిని తన కోసమే కొట్టుతున్నదని తెలుసుకుని, "ఎందుకత్తయ్యా? నాదగ్గర షాంపూ వుంది. ఇన్నాళ్ళూ నేను షాంపూతోనే తల కడుక్కుంటున్నా, ప్రాణానికి తగని హాయి! జుట్టు చిక్కు పడదు. ఖర్చు తక్కువ. ఘూమున్నరసేపు దువ్వెనలో వెంట్రుకలు తెంపు కోనక్కర్లేదు, క్షణంలో తల అరిపోతుంది. తల మంచి వాసన కొడుతుంది!" అన్నది.

"ఖర్చు" అనేమాటకు హనుమాయమ్మగారి గుండె గుబుక్కుమన్నప్పటికీ ఆవిడ పైకి ఆనందం కనబరుస్తూ, "అట్లాగుటే? నాకు తెలీదు సుమా!" అన్నది. ఆవిడ కుంకుడునురుగు పోసే మిషమీద స్నానాల గదిలో చేరి కోడలితో మాట్లాడదామని ఆశ పడింది. ఆ ఛాన్సు పోయింది. అయినా, అవిడ స్నానాల గదిలో చేరి నీళ్ళు పాళాలుచేస్తూ కోడలు లోపలికి వచ్చేదాకా అక్కడేవుండి పోయింది.

"అయితే, ఏం వే? అన్నట్టు నువ్వు నెలనెలా—" అన్న దావిడ, కృషలోపలికి రాగానే.

"ఊ, ఆ! ఏం లేదు!" అన్నది కృష.

"రెండోవాడికి ఏడాది వెళ్ళిందిగా!"

"శ్రావణమాసానికే వెళ్ళింది,"

"నన్నుండమన్నావా? నువే పోసుకుంటావా?"

"మీరు పని చూసుకోండత్తయ్యా"

"ఇదుగో—ఇవి వేన్నీళ్ళు, ఇవి చన్నీళ్ళు, ఇవి తోడినవీళ్ళు. త్వరగా తెమిల్చి వచ్చెయ్యి. చాలా సంగతులు చెప్పాలి."

హనుమాయమ్మగారు స్నానాలగదిలోనుంచి ఇవతలకు వచ్చిందో లేదో లక్ష్మి, నెహ్రూ పగలబడినవ్వుతూ ఉండటం వినిపించింది. తన పరిసరాల్లో ఏది జరిగినా, దాన్ని ఆరా తియ్యకపోతే ఆవిడ ప్రాణం కొట్టుకుపోతుంది. ఆవిడ గబగబా ముందుగదిలోకి వెళ్ళి చూసేసరికి లక్ష్మి చేతిలో ఏదో పత్రిక ఉంది. లక్ష్మి ఆనందబాష్పాలుతుడుచుకుంటున్నది. నెహ్రూ నవ్వు సంబాళించుకుని, "చదువు, చదువు!" అని అక్కను ప్రోత్సహిస్తున్నాడు.

"ఏమిట్రా అదీ?" అన్నది హనుమాయమ్మ.

"అప్పుడు వెంకాయమ్మ వచ్చింది—" అంటూ నెహ్రూ నవ్వాపుకోలేక వెల్లకిలా పడి కాళ్ళూ చేతులూ తన్నుకున్నాడు. లక్ష్మి చేతులు పొట్టకు అదుముకుని ముందుకు వంగిపోయి మూలిగింది.

వాళ్ళ కాస్త నవ్వు తెరలోనుంచి బయటికి వచ్చే సమయంలో హనుమాయమ్మ, "నన్నేనా వెంకాయమ్మంటున్నారూ"" అన్నది.

లేవబోతున్న నెహ్రూ మళ్ళీ వెనక్కుపడి పొర్లి గింతలు పెడుతూ నవ్వలేక "అమ్మో!.... అయ్యో!" అన్నాడు. వాడు అంతగా నవ్వటంవల్లనే తనకు కడుపుబ్బి

పోతున్నట్టుగా లక్ష్మి వాణ్ణి ఒక్కటి కొట్టి బోర్లాపడి నవ్వింది.

అసలే హనుమాయమ్మ అనుమానం మనిషి. పక్కింట్లో వాళ్ళు నవ్వినా తనను చూసే అయివుంటుందేమో ననుకునే బాపతు. వీళ్లు తననుచూసే నవ్వుతున్నారని ఆవిడకు గట్టి అనుమానం తోచింది. తాను రాకమునుపే వాళ్ళు నవ్వుతున్నారన్న విషయంకూడా ఆవిడ అనుమానాన్ని అడ్డగించలేదు.

"మీకేమన్నా దయ్యం పట్టిందా ఏం?" అన్నది హనుమాయమ్మ.

నెహ్రూ ఆశ్చర్యంతో నవ్వటం మరిచిపోయి, కళ్ళు పెద్దవిచేసి, హారర్, దయ్యంకూడా వచ్చిందేవ్!" అంటూ మళ్ళీ నవ్వుతూ దగ్గరికి తెచ్చుకున్నాడు.

"నువ్వు నోరు మూసుకోకపోతే చంపుతా!" అంటూ లక్ష్మి మెలికలు తిరిగిపోయింది.

హనుమాయమ్మ ఇక భరించలేక ఇద్దరినీ చెరొకటీ వేసింది.

"ఇదికూడా వుంది! ఇదికూడా వుంది!" అంటూ నెహ్రూ దూరంగా జరిగాడు.

లక్ష్మి రుసరుసలాడుతూ, "మేం పత్రికలో కథ బాగుందని నవ్వుతుంటుంటే నిష్కారణంగా వచ్చి మమ్మల్నెందుకు కొడతావ్?" అన్నది.

"అడిగినప్పు డామాట చెప్పగూడదమా? తీపరం వా?" అన్నది తల్లి.

"అసలీ కథంతా నీ మీాదేలే! ఆ వెంకాయమ్మవు అచ్చు నువే!" అన్నాడు నెహ్రూ.

"మీా మొహం !" అన్నది హనుమాయమ్మ.

"మా మొహమేం కాదులే, ఆకథ రాసిందిసరోజినే. ఇదుగో చూసుకో !"

మళ్ళీ హనుమాయమ్మ కడుపులో సన్నగా భయం లాటిది బయలు దేరింది. ఆవిడ పిల్లలచేతిలో వున్న పత్రిక తీసుకుని చూసింది. ఆవిడ, పాపం! అచ్చు అక్షరాలైతే కూడబలుక్కు చదవగలదుగాని ఈ కాలపు పత్రికలలో బొమ్మలూ, హెడ్ డ్రాయింగూ చిందరబందరగా ఉండే అచ్చూ, చేతిరాతలూ, రాసిన కథపేరూ, రచయితపేరూ, చూడడం ఆవిడకు సాధ్యంకానిపని.

"ఏదీ? దానిపేరు ఎక్కడా కనిపించదేం?"

లక్ష్మి సహాకరించటానికి తల్లిదగ్గరికి వచ్చింది! "ఇదుగో, చూడు, గృ-హ-దే-వ-త. ఇక్కడ కిందచూడు, స-రో-జి-ని. గృహదేవత అంటే వెంకాయమ్మ. ఆ వెంకాయమ్మ అచ్చు నువే, నీలాగే మాట్లాడుతుంది, శివాలాడుతుంది, అందరిచేతా సర్కసుచేయిస్తుంది; మిగిలిన వాళ్ళందరికి సర్కసు జంతువులని పేరు పెట్టింది - వెంకాయమ్మ కాదు, సరోజిని. ఆ సర్కసు జంతువుల్లో వెంకాయమ్మ అత్తగారుకూడా వుంది. నీకు అత్తగారులేదు, అంతేతేడా.

మనకు నెహ్రూ వున్నట్టే వెంకాయమ్మకు గాంధీ వున్నాడు. ఇటువంటి పేర్లు పెట్టేవాళ్ళని బాగా ఏడిపించిందిట. నెహ్రూ, గాంధీ, తిలక్ ఇవి మనుషులపేర్లు కావుట, ఇంటి పేర్లుట. వాటిని మనం సొంతపేర్లుగా పెట్టుకుని ఊరేగుతున్నామని ఎద్దేవా చేసింది. అయితే అమ్మా, నెహ్రూ అని పేరు పెట్టటం నీకు తట్టిన ఆలోచనా నాకు తెలీదే!" అన్నది.

హనుమాయమ్మ మొహంకంపలు ఊడి వెలిక్కి... "ఏం అయితే? నేనే పెట్టమన్నా! మా తోటికోడలు పిల్లలందరికీ దేశభక్తుల పేర్లు పెట్టించింది. మా నాన్న గవర్నమెంటు ఉద్యోగంలోనే లేకపోతే మా అందరికీ ఆ పేర్లే పెట్టించేదాన్ని," అన్నది.

"ఈ సంగతి సరోజనికి ఎట్లా తెలిసిందో!"

"ఉన్నాడుగా నిక్షేపరాయుడూ! అన్న . బావతో చెప్పుకున్నాడు గావాలు!" కృష్ణ స్నానం ముగించు బయటకు వచ్చింది.

"అప్పుడే అయిందా? నన్ను కేకెయ్యకపోయినావా వీపు రుద్దేదాన్ని!" అంటూ హనుమాయమ్మ కోడలికి మళ్ళీ "త్రైరు" వడ్డించసాగింది.

కృష్ణ అత్తగారికేసి ఆశ్చర్యం పైకి కనబడకుండా చూసింది. అత్తగారు ఏనాడూ తన వీపు రుద్దలేదు. ఆవిడకు తనమీద గొంతుదాకా కోపం వున్న సంగతి కూడా కృష్ణకు తెలుసు. ఆవిడ ఇంతగా దిగజారిపోవటానికి

కారణం వుండాలి. హనుమాయమ్మ తన కష్టాలు చెప్పుకోటానికి తహతహలాడుతున్నట్టుకూడా కృష్ణ పసికట్టింది.

హనుమాయమ్మ పెంపుడు కుక్కలాగా కృష్ణ వెనకటితో గదిలోకి వెళ్ళింది. ఆమె పెట్టెలోంచి చీర తీస్తుంటే, "ఎంత మంచిచీరో! వీటినేనా పునహాచీరలంటారూ? ఓహో, అవి వేరుకాదూ, ఏవైనా ఇంత మంచి చీరెలు ఇక్కడ దొరకవే? .... పుత్తూరుచీరేనా? గుర్తుపట్టలేకపోయినాను సుమా!....నువ్వన్నది నిజమేనేవ్! ఆ షాంపూ రుద్దుకుంటేజుట్టు పట్టు కుచ్చులేవుంది.... దాని పేరు షాంపూవా? ఏదో ఒకటిలే....జుట్టు కొంచెం కూడా చిక్కుపడదేం? వుండు, దువ్వెనతో నాలుగుసార్లు జుట్టు దువ్వుతాను!...అదేవిటే! బ్రష్టా, జుట్టు దువ్వుకోటానిక్కూడా బ్రష్షులా? చిత్రంగా ఉందే! ఎక్కడా వినలేదు. చూడలేదు!..." అంటూ చాలాసేపు జిడ్డు పట్టించింది.

ఆవిడ క్లుప్తంగా పదినిమిషాల్లో కోడలికి తన కాబోయే కోడలి ఉదంతమంతా తన పరంగా చెప్పింది. అంతా వింటూ కృష్ణ తన అత్తగారిని అడ్డమైనతిట్లూ తిట్టుకున్నది. కాని చివరకు "దొరకక-దొరకక ఇటువంటిది దొరికిందా?" అన్నది సానుభూతి నటిస్తూ.

"నా మనస్సు నువ్వొక్కత్తెవు కనిపెట్టావే, ఇదిగో చూడూ! అందరూ చేరి దాని పక్షమై నన్ను ఒంటిదాన్ని చేసేశారు-నీతోడు!" అన్నది హనుమాయమ్మ.

"అదంతా ఆ అమ్మాయి మీద అభిమానమనుకుం టున్నారా ఏం!" అన్నది కృష్ణ జుట్టు ముందు వేసుకుని వదులుగా జడ వేసుంటూ. హనుమాయమ్మ బిత్తరపోయి నట్టుగా, "నేనట్లాగే అనుకుంటున్నాను సుమా ! అది వీళ్ళందరికీ ఏదో మందు పెట్టిందనుకుంటున్నా!...నువ్వే మంటావ్?" అన్నది.

"మీమీదవున్న కసి అంతా ఈ విధంగా తీర్చు కుంటున్నారు! అంతకంటె మరేవీ లేదు."

"వాళ్ళకు దాని మీద అభిమానం నిజంగా లేదం టావా ఏంవిటి?"

"ఎలా ఉంటుందండీ! మీకు పిచ్చిగాని! చెబుతూంటే వింటుంటేనే నాకు ఆ పిల్లమీద రోత పుడుతుంటేనూ!"

"నా కదే కావలసింది ! నీక్కూడా రోత పుట్టింది గదా ! ఇహ వీళ్ళందరూ ఎంత ఏడుచుకున్నా నేను లక్ష్యపెట్టను...అన్నట్టిది విన్నావా? ఆ పక్షి నామీద కథ రాసిందట ! ఆ లక్ష్మి, వాడూ పడీ పడీ నవ్వుకుంటు న్నారు! ఈ విడ్డూరం ఎక్కడన్నా విన్నావ్?"

అతి కష్టంమీద నవ్వు ఆపుకుని, నవ్వు మొహాన్ని బాధమొహంగా మార్చటానికి యత్నిస్తూ, "మీమీద కథ రాసిందా? ఆ పిల్ల ? ఎందులో?"

"ఆఁ" అంటుండగానే కృష్ణకు నవ్వు తోసుకుని వచ్చేసింది. ఆమె మొహం పక్కకుతిప్పి ఆ చప్పుడును దగ్గుగా మార్చేసి చాలాసేపు దగ్గింది.

"నువు తెచ్చిన పత్రికలోనే! నువ్వేమీ చూడ లేదా ఏం?"

కృష్ణ మొహం పక్కకుతిప్పి ఫ్రాక్కు లెగరేసి దగ్గుతూ, "కథలన్నీ చదవలేదు," అన్నది.

అసలుసంగతేమిటంటే కృష్ణ "గృహదేవత" అన్నకథ చదివింది. అది తన అత్తగారిమీదే రాసిన కథ అని చదివినప్పుడు స్ఫురించలేదు. ఇది స్వాభావికమే. కృష్ణ తన అత్తగారిని హాస్యపాత్రగా ఎప్పుడూ చూడలేదు — విషపాత్రగా మాత్రమే చూసింది. కృష్ణ కాబోయే తోడికోడలు ఆవిడలో హాస్యం చూడగలుగుతుందని ఆమె కలలోకూడా ఊహించలేదు.

"చూడు కృష్ణా? ఇహ వంటింట్లో పోయి పడాలి. కాస్త వంట సహాయం చేద్దువుగాని రా, పిల్లలు మళ్ళీ ఆకళ్ళంటారు. నీతో ఇంకా చాలా సంగతులు చెప్పాలి కూడాను!"

కృష్ణ వంటింట్లో చేరి అత్తగారిచేత చాలా జిడ్డు పట్టించుకున్నది. హనుమాయమ్మగారు మాట్లాడటం మొదలుపెడితే—నెహ్రూ చెప్పినట్టు—బ్రేక్ ఒకంతట పడదు. వినేవాళ్ళు మందమతులనీ, ప్రతిచిన్న విషయాన్నీ ఏడెనిమిది రకాలుగా చెబితేగాని వాళ్ళ తలకు పట్టదనీ ఆవిడ నమ్మకం. అదీగాక తాను మాట్లాడుతుంటే ప్రపంచాని కంతకీ విన్నకొద్దీ ఇంకా వినాలనుంటున్నదని కూడా ఆవిడకు చిన్నతనంలోనే ఒక అభిప్రాయం ఏర్పడిపోయింది.

ఆఖరుకు ఆవిడ, "ఇప్పుడు విషయమంతా విన్నావు గనక నన్నేం చెయ్యమంటావు చెప్పు. నాకు నీ సలహా కావాలి. ఈ రిజిస్ట్రారు పెళ్ళికి నేను వెళ్ళాలా, వద్దా? నాకు వెళ్ళాలని లేదనుకో, నువు వెళ్ళమంటే వెళతా! ఆలోచించి మరీ చెప్పు!" అన్నది. ఆవిడ పుట్టి పెరిగిన యాభై ఏళ్ళ కాలంలో ఇంత గురి ఎవరిమీదా ఉంచి ఎరగదు.

"మీరు వెళ్ళొద్దు! ఏం వౌతుందో చూస్తాం! వియ్యపరాలెక్కడని వాళ్ళని అందరూ అడిగినప్పుడు వాళ్లు తల తీసుకుపోయి ఎక్కడో పెట్టుకుంటారు!" అన్నది కృష్ణ.

హనుమాయమ్మగారి హృదయం ఆనందంతో నిండి పోయి మొహంలోనుంచి బయటికి వెళ్ళుకొచ్చింది.

## 10

మధ్యాహ్నమనంగా పెళ్ళివారింటికి వెళ్ళినవాళ్ళు ఇంకా తిరిగి రాలేదు. బిక్కుబిక్కుమంటూ హనుమాయమ్మగారు ఇంటో ఒక్కతే ఉన్నది. రేపు ఉదయమే పెళ్ళి, సాయంకాలం మేజవాణీలు. అయినా ఇప్పుడు మేజువాణీకి ఇంకేదో పేరు పెట్టారు—రిసెప్షనో ఏవిటో! ఆ పాతమాటలుకూడా పోతున్నై. ఏం చిత్రమో!

ఇన్ని గంటలసేపు వాళ్ళక్కడ ఏం అఘోరిస్తున్నట్టూ? లాంఛనంగా కాస్సేపు కూచుని వచ్చెయ్యకూడదూ? జానకికూడా వెళ్ళింది—లేకపోతే కాస్త మాట్లాడ్డానికన్నా ఉండును.

అప్పుడే చీకటికూడా పడిందే! వీళ్ళు ఏకంగా అక్కడే ఉండిపోతారా ఏం?

హనుమాయమ్మ ఒకముక్కుతో చాపమీద లేచి కూచుని, నేలమీద రెండుచేతులూ ఆనించి ఒక్క మూలుగుతో లేచి, తరవాత నిలబడి, వెళ్ళి దీపం వేసి లెంపలు వాయించుకుంది.

దీపం వేసినప్పటినుంచీ కాలం మరింత మందంగా నడిచింది.

తరవాత ఓ పావుగంటకి—అదే ఆవిడ ప్రాణానికి గంటన్నర లాగుంది! గేటుదగ్గర మాటలు వినిపించినై. కృష్ణా, లక్ష్మి, జానకీ, పిల్లలూ వచ్చారు.

"ఇంతసేపూ అక్కడే ఉన్నారుటర్రా?...కాస్సేపు కూచుని పోదువుగాని లేవమ్మా, జానికెమ్మతల్లీ !... మాటా? రోజూ ఉన్నమాటేగా? మధ్యాన్నంనించీ మాట్లాడే వాళ్ళు లేక బిక్కుబిక్కుమంటూ ఇంటోపడి ఉన్నాననుకో! ఇంత ఆలస్యం చేశారేం?" అన్నదావిడ.

"ఇప్పుడు మాత్రం వెళ్ళనిచ్చారూ? భోంచేసి ఈ రాత్రికి అక్కడే పడుకోమన్నారు. తప్పించుకు రావడం మాదే మొరటుతనమనిపించింది" అన్నది కృష్ణ.

"పిన్నిగారూ, ఏవిటో అనుకున్నానుగాని అప్పుడే టెలిగ్రాంవులు వస్తున్నై," అన్నది జానకి.

"టెలిగ్రాంవులా! దేనికీ?" అన్నది హనుమాయమ్మ, వాటినిచూసి భయపడటం ఆవిడ చిన్నతనంలోనే నేర్చుకొన్నది.

"ఫెలిసిటేషన్స్" అన్నది లక్ష్మి.

"ఫిలిసేషనేవిటే, పిచ్చిమొద్దూ?"

"పెళ్ళి బాగా జరగాలని కోరుతూ నెహ్రూ, ఇతర మంత్రులూ, గొప్పగొప్పవాళ్ళూ టెలిగ్రాములు పంపించారు." అన్నది కృష్ణ.

"నెహ్రూయే?" హనుమాయమ్మగారు ఆశ్చర్యంతో పాలిపోయింది.

"టెలిగ్రాంలదేం గానీండి, ఇవాళ లక్ష్మికి ఒక మంచివరుడు దొరికాడు. పాపం, అంతసేపూ ఆ అబ్బాయి కళ్ళు లక్ష్మిమీదినే!" అన్నది కృష్ణ లక్ష్మిని కొంటెగా చూస్తూ.

"ఫో, వొదినా?" అన్నది లక్ష్మి మొహం ఎర్రగా చేసుకొని.

"ఎవరే ఆ అబ్బాయి? తెలిసినవాడేనా? పెళ్ళి కాలేదా? మన కులంవేనా? మన జాతేనా! చదువుకున్నాడా? ఎన్నేళ్ళవాడు? డబ్బుందా? చూట్టానికి బాగుంటాడా?" అంటూ హనుమాయమ్మ పెద్దకోడలి మీద ఎగబడింది.

"ఆ అబ్బాయికి పెళ్ళి కాలేదు గనకనేగా అనుకోటం? పెళ్ళయినవాడు లక్ష్మికేసి అదేపనిగా చూస్తుంటే అప్పుడే చెప్పు తీసుకొట్టి ఉండం? ఆ అబ్బాయి చాలా నాజూగ్గా ఉంటాడు. లక్ష్మికన్నకూడా మంచి రంగు. మన చలపతికన్న ఒకటి రెండేళ్ళు చిన్నేమోననుకుంటా. పెళ్ళి కూతురికి సమానా పినతండ్రి కొడుకు. వాళ్ళకి కట్టుకుపోయినంత ఆస్తి ఉంది. ఎమ్మే చదువుతున్నాట్ట. ఈ ఏటితో అయిపోతుందిట. ప్రతి పరీక్షలోనూ డిస్టింక్షన్ మార్కులు తెచ్చుకుంటాట్ట. అయ్యేయెస్‌కుపోతుంటే తప్పక నెగ్గుతాడంటున్నారు.

"అంటే ఏమిటో!" అన్నది హనుమాయమ్మ.

"అయ్యేయెస్‌లో నెగ్గితే ఏ కలెక్టరో, సెక్రటరీయో అవుతాడు. పెద్ద ఉద్యోగం కాదూ?"

"కాదూ మరి?" అన్నది హనుమాయమ్మ పరధ్యానంగా. ఆవిడకు గొంతెమ్మ కోరికలు కోరాలనే ఉంది గాని, ఇంతమంచి సమ్మంధపుం యేటికి అద్దరి అయి

కూచుంది. ఇంత మంచి పెళ్ళికొడుకుకూ తన కూతురికీ మధ్య "అది" ఉండిపోయింది—ప్రారబ్ధం.

"నా కిప్పుడు పెళ్ళే వద్దు" అన్నది లక్ష్మి—తాను ఏదో ఒకటి అనకపోతే ఇంకో విషయం మాట్లాడతారేమోనని.

"చాల్లే ఊరుకో! పెళ్ళి అక్కర్లేని దానివి ఆ అబ్బాయిని అట్లా ఎందుకు కవ్వించావ్?" అన్నది కృష్ణ కోపం అభినయిస్తూ.

"నేనా!" అన్నది లక్ష్మి అత్యంత ఆశ్చర్యం అభినయిస్తూ.

"ఆహా! నువే! కళ్లు ఆ అబ్బాయిమీద పెట్టి మా మాటలకు నవ్వినట్టు నవ్వటం, నిమిషానికి నాలుగు సార్లు అతను ఎక్కడున్నాడో అని వెదుక్కోవటం—నీ దొంగ వేషాలు నేను చూడలేదనుకున్నావా?"

"అన్నీ వొట్టిది! నేనేమీ చెయ్యలేదు. నాకసలు అటువంటి పనులంటే అసహ్యంకూడా!"

"అంటే, అటువంటి పనులు ఎందుకు చేస్తారో నీకు ముందే తెలుసన్నమాట! నువ్వింకా అమాయకురాలివనుకున్నా?" అన్నది కృష్ణ లక్ష్మిని ఏడిపించటానికి.

"నువు నిజం చెప్పు; జానికెమ్మతల్లీ! ఆ పిల్లవాడు నిజంగా లక్ష్మికి ఈడుగా ఉన్నాడా ఏమిటి?" అన్నది హనుమాయమ్మ.

పిల్లవాడు చాలా బాగున్నాడులెండి. కాని, మీకు అందుతాడా అని నాకు అనుమానం. నిజంగా అందితే లక్ష్మి గొప్ప అదృష్టవంతురా లన్నమాటే! మహా యోగం పట్టిందనుకోవచ్చు....అదుగో మా వారు వస్తున్న ట్టుంది, ఇక నేను పోతానండీ, ఇంకా ఇంట్లో దీపంకూడా వెలిగించలేదు!" అంటూ జానకి తమ భాగానికి వెళ్ళి పోయింది.

జానకి భర్త వచ్చిన మాట నిజమే. అతని వెంట కోటీ, చలపతీ, ముసలాయనా, నెహ్రూ కూడా లోపలికి వచ్చారు. వాళ్ళకు వెనకగా వచ్చాడు—ఆ అబ్బాయే! ఎవరూ చెప్పకుండానే హనుమాయమ్మ ఆ నాజూకైన తెల్లని అబ్బాయిని గుర్తు పట్టేసింది. ఆవిడ గుండెలో "అద్దరి, అధరి" అనే మాట మారుమోగుతున్నది,

"నిన్నెవరూ కొరుక్కు తినరు లేవమ్మోవ్ లక్ష్మమ్మా!" అంటూ కృష్ణ లోపలికి పోబోతున్న లక్ష్మి చెయ్యి గట్టిగా పట్టుకుంది. తప్పించుకోవడానికి పెనుగులాడుతున్న లక్ష్మిని చూసి ఆ అబ్బాయి నవ్వడం హనుమాయమ్మ కళ్ళారా చూసి తరించింది, కాని—

అధరి! అధరి!....

"కృష్ణా! మాకందరికీ మంచి కాఫీ కావాలి" అన్నాడు కోటి,

చలపతి కుర్చీలు తెచ్చి ఆరుబయట వేశాడు.

అందరూ కూచున్నారు.... ఆ అబ్బాయి కళ్ళు మాటి మాటికీ లక్ష్మివేపే తిరుగుతున్నై!

హనుమాయమ్మకు వల్లమాలిన సాహసం వచ్చేసింది.

"అయితే, కోటీ, ఈ అబ్బా యెవర్రా? ఎప్పుడూ చూసినట్టు లేదే!" అన్నది.

"పెళ్ళికూతురికి వేలువిడిచిన తమ్ముడు—అనేం గాం వాలు కొంపదీసి!" అన్నాడు కోటేశ్వరరావు.

"పెళ్ళి అయిందా?" అన్నది హనుమాయమ్మ కుండ పగలేసినట్టుగా,

ఆ అబ్బాయి సూటిగా హనుమాయమ్మకేసి చూసి మొహం విచ్చి నవ్వాడు.

"ఏం వండీ అలా అడిగారు?" అన్నాడతను. అతని గొంతులో శౌర్యమూ, పరాక్రమమూ ఉన్నై. తన కొడుకులకు అవీ లేకుండా చేసినప్పటికీ హనుమాయమ్మ ఆ గుణాలను మరొకరింలో చూసి మెచ్చుకో గలిగింది.

"మరేంలేదు నాయనా! నిన్ను చూస్తుంటే మా లక్ష్మి, నువ్వూ ఎంత ఈడూ జోడుగా వుంటారా అనిపించింది" అన్న దావిడ తన శౌర్య పరాక్రమాలను ప్రదర్శిస్తూ.

"కావచ్చు గానీండి. నేను అమ్ముడు పోయాను—విశ్వామిత్రుడికి హరిశ్చంద్రుడు అమ్ముడయినట్టు! ....మా సరోజ తాను నిర్ణయించిన పిల్లను తప్ప నేను పెళ్ళాడ

రాదని నాకు ఆంక్ష పెట్టింది. నా చేత ప్రమాణం కూడా చేయించింది. సరోజ కొండమీద కోతిని తెచ్చి చేసుకోమంటే చేసుకు తీరాలిసిందే!" అన్నాడా అబ్బాయి.

అధరి! అధరి; ముళ్ళు! పీటముళ్లు! ...

హనుమాయమ్మ ఓటమి ఆమోదించిన దానిలాగా నిట్టూర్చింది.

తరవాత ఒక అరగంటకు ఏదో కారులో కోదండ రామయ్యగారూ, ఆయన భార్యా వచ్చారు. ఇద్దరూ హనుమాయమ్మగారి దగ్గరికి వచ్చారు.

"వదినగారూ, మీ రింకా బయలుదేరడంలేదేఁవిటి? తెల్లవారగానే రిజిస్ట్రారు వచ్చి పెళ్ళి చేసేస్తాడు. ఈవాళ రాత్రి మనకు నిద్రపోవటానికి తీరనన్ని పనులు. చీరెలూ, బట్టలూ అవీ కొన్నాం. మీరుకూడా చూసి బాగున్న య్యంటేనే మాకు తృప్తి!" అన్నది కోదండరామయ్య భార్య.

"సరే, మీ రన్నదే కానివ్వండి. నాదేమీ ఆలస్యం లేదు, నేను అరనిమిషంలో బయల్దేరగలను" అన్నది హనుమాయమ్మ. ఆవిడ తన పెద్దకోడలి మొహం తప్పించింది.

కాని, లక్ష్మి, ఆ అబ్బాయీ ఒకరిని ఒకరు చూసి నవ్వటం ఆవిడకు కనిపించింది.

పంచాయతీ

వేమన [illegible]



## మనసు ఫౌండేషన్

### పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLAB10JB 126 |
| పుస్తకం పేరు | కొత్త కోటలు |
| తారీఖు | [illegible]/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 87 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1108 |
| తయారు చేసినది | pragathi |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | no |
| తప్పులు | no |
| పరిస్థితి | good |